శ్రీరామచంద్రాయనమః

# విజయవిజయము

లేక

# కర్ణవిక్రమము.

ఇయ్యది

చత్రపురాన్లోని మహాపాఠశాలాపండితులగు

భాగవతులనృసింహశర్మగారిచే

విరచితము.



శ్రీవిక్టోరియాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

బ్రహ్మపురము.

1917

          [ Price Rs 0—10—0.

# ఇందలి పాత్రలు.

1 శ్రీకృష్ణుఁడు.
2 అర్జునుఁడు.
3 కర్ణుఁడు.
4 శల్యుఁడు.
5 ధర్మరాజు.
6 దుర్యోధనుఁడు.
7 భీముఁడు.
8 దుస్ససేనుఁడు.
9 దృష్టద్యుమ్నుఁడు.
10 అశ్వత్థామ.
11 కృపాచార్యులు.
12 సత్యసేనుఁడు.
13 వృషసేనుఁడు.
14 శకుని.
15 క్షేమధూర్తి.



మఱియునితరులు సందర్భానుసారముగ వత్తురు

# విజయవిజయము.



## విజ్ఞప్తి

ఆంధ్రభాషాభిమానులారా!

నేనీనాటకము శ్రీరామాంకితముగ రచించి చాలకాలమైనది. నడుమఘటిల్లిన కొన్ని కారణాంతరములచే నీనాటక ముద్రణగాంచకయుండెను. నామిత్రులు కొందఱీనాటకముంగాంచి మిక్కిలిసంతసించి ముద్రింపించుటకు నన్ను హెచ్చరించిరి. అందుచే నేటికైనఁ బ్రకటింపఁబడిన భాగ్య మీకృతికిలభించినది. గుణాగుణములు విమర్శించుభారము పాఠకులపైనున్నది. నామిత్రులలోఁ గొందఱీనాటకముఁ గాంచి మిక్కిలి కఠినముగ నున్నదనిపలుకుటచేఁ బలుమారులీనాటకము మరల రచింపవలసివచ్చినది. నాకు సాధ్యమగునంత దనుక కఠినస్వభావము న్యూనముగఁ జూపించితి. ఈయంశము బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారిచే రచింపఁబడిన విమర్శనము సాక్షిభూతమైయుండును. ఈనాటకము ముద్రింపించుటలో నాకుమిక్కిలి తోడ్పడిన బ్రహ్మశ్రీ యామిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారి ఋణము నేనెన్నిజన్మములకయినఁ దీర్పఁజాలను. ఇతఁడు చెలికాడై చుట్టమై, మీఁదు మిక్కిలిగురువైనా ప్రయత్నములకుఁ దోడ్పడుటకు నేనుమిక్కిలి కృతజ్ఞుఁడనై భక్తిపూర్వకముగ గురుభావముఁ గలిగి నమస్కరింపుచున్నాను. సమాజవార్షికోత్సవ సందర్భమున నన్ను బహూకరించి, నానాటకరచనకు సంతసించిన, భవత్ శ్రీరాంధ్రభాషాభివర్ధనీ సమాజమువారికిని, వారి ప్రేరణమున నానాటకమునకు విమర్శన

విజయవిజయము.

మా రచించిన బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారికిని కృతజ్ఞతాపూర్వకముగ నమస్కరించుచున్నాను.

ఇట్లు భాషాసేవకుఁడు

భా॥ నృసింహశర్మ

గ్రంధకర్త.

ఛత్రపురాంధ్రసమాజ వార్షికోత్సవము నాడు బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి, బి॥ ఏ॥ గారు విరచించి పఠించిన విమర్శనము.

## విజయవిజయవిమర్శనము.

శ్రీమచ్ఛత్రపురాంధ్ర భాషాభివర్ధనీసమాజ వార్షికోత్సవ సందర్భమున బ్రహ్మశ్రీ భాగవతుల నృశింహశర్మగారిచే నూతనముగ విరచింపఁబడిన విజయవిజయనాటకవిమర్శనకార్యము నాపైఁబెట్టినందుకు సమాజమువారికి నేనురెండువిధములఁ గృతజ్ఞుఁడనైయున్నాను. ఈసమాజము స్థాపించి యారుసంవత్సరములైనది. స్థాపనోద్దేశము భాషాభివర్ధనము. భాషాభివర్ధనమునకు గ్రంధపఠన మెంతయావశ్యకమో, గ్రంధకర్తలకుఁ బ్రోత్సాహమొసంగుటయు నంతయావశ్యకము. అట్టి యావశ్యధర్మనిర్వహణము నారుసంవత్సరములకైనను, సమాజము గ్రహింపఁగలిగినదాయని నాకానందమైనది. సుమారు నూర్వురుసభ్యులుగల యీస

మాజమున, గ్రంథవిమర్శన కార్యమునకు నన్నొకపెద్దఁజేసి నాకుగౌరవముఁగలిగించినందున సమాజమువారికి నేను కృతజ్ఞుఁడనై యుండుటకది మొదటికారణము. ఇఁకనన్ను విమర్శనము వ్రాయుమన్న గ్రంథము నాకుఁ జిరపరిచయులగు శ్రీభాగవతుల నృసింహశర్మగారిచే వ్రాయఁబడినదగుటచేనది నాకృతజ్ఞతకు రెండవకారణము. యీవిమర్శనమునఁ గల లోపముల శ్రీశర్మగారును సమాజమువారును గూడ క్షమింతురనియెంచి విమర్శనమునుఁ బ్రారంభించుచున్నాను.

విజయవిజయమను పేరుగల యీగ్రంథము 5 అంకముల దృశ్యకావ్యము. ప్రాచీన లక్షణానుసారముగ వ్రాయఁబడిన దృశ్యకావ్యములకును, నర్వాచీన లక్షణానుసారముగ వ్రాయఁబడినవానికిఁ జాలభేదముగలదు. ఈకాలమునఁ గొన్ని దృశ్యకావ్యములు ప్రాచీన లక్షణానుసారముగను, కొన్నియర్వాచీన లక్షణానుసారముగను వ్రాయఁబడుచున్నవి. కొన్నిటిలోఁ బ్రాచీనలక్షణములుకొన్నియు, నర్వాచీన లక్షణములు కొన్నియుఁ గనఁబడుచున్నవి, వీనిని మిశ్రలక్షణములని చెప్పవచ్చును. "ప్రస్తావముననున్న విజయవిజయమే లక్షణముల ననుసరించి వ్రాయఁబడిన" దనునంశము మొదట చర్చింపనలసియున్నది. సుప్రసిద్ధులగు విశ్వనాథ పంచాననులవారు తమసాహిత్యదర్పణమున నాటకలక్షణముల నిట్లువ్రాసిరి. "నాటకంఖ్యాతవృత్తంస్యాత్ పంచసంధి సమన్వితమ్। విలాసర్ద్యాది గుణవద్యుక్తం నానారసవిభూతిభిః। సుఖదుఃఖసముద్భూతిర్నానారస నిరంతరమ్। పంచాదికాదశ పరాః స్తత్రాఙ్కాః పరికీర్తితాః॥

ప్రఖ్యాత వంశో రాజర్షిర్ధీరోదాత్తః ప్రతాపవాన్। దివ్యోథది వ్యా దివ్యోవాగుణవాన్ నాయకోమతః। ఏక ఏవ భవదఙ్గీ శృంగారో వీర ఏవవా। అంగమన్యేరసాః సర్వేకార్యం నిర్వహణేద్భుతమ్। చత్వారః పం చవా ముఖ్యాః కార్యవ్యాపృత పూరుషాః॥''

ఇందుముఖ్యాంశము లేవన;—

1 నాటకవృత్తము ప్రఖ్యాతమైయుండవలెను.

2 5కు, తక్కువకాక, 10కి, ఎక్కువకాక యంకము లుండవలెను.

3 నాయకుఁడు ప్రఖ్యాతవంశ సముద్భూతుఁడును, రాజర్షియును, ధీరోదాత్తుఁడును, ప్రతాపవంతుఁడును, దివ్యుఁడైనను లేక దివ్యాదివ్యుఁడయినను, గుణవంతుఁడునునై యుండవలెను.

4 శృంగారవీరరసముల నేదోయొకరసము ప్రధానముగను, తక్కినరసము లంగములుగాను నుండవలెను.

5 కార్యనిర్వహణమద్భుతమైయుండవలెను.

6 కార్యనిర్వాహకులలో ప్రధానులు నలువురైదుగురుమాత్రమే యుండవలెను. ఈనాటకమున నీపై యారులక్షణము లుఁ గనుపట్టుచున్నవి. నాటకవృత్తము సుప్రసిద్ధమైన మహా

భారతము నందలిది. ఇది వైదంకములుగా భాగింపఁబడినది. నాయకుఁడు ప్రఖ్యాతచంద్రవంశ సంభూతుఁడును, భక్తాగ్రేసరుఁడును, ధీరోదాత్తుఁడును, ప్రతాపవంతుఁడును, దివ్యాదివ్యుఁడును గుణవంతుడునగునర్జునుఁడు. ఇందు వీరరసముప్రధానము. రౌద్రభీభత్సహాస్య కరుణాది రసములంగములు. కార్యనిర్వాణమత్యద్భుతమగు కర్ణసంహారము. కార్యనిర్వాహకులలో కర్ణ శల్యకృష్ణార్జునులుప్రధానులు. ఈపైకారణములఁబట్టి యిది గీర్వాణనాటక సంప్రదాయాను సారముగ వ్రాయబడినదని తలంపవచ్చును. కాని కొన్ని గీర్వాణనాటక లక్షణము లుల్లంఘింపఁబడినవి. నాటక సంధులనియు సమముగా ననుసరింపలేదు.

" దూరాహ్వానంవధోయుద్ధం రాజ్యదేశాదివిప్లవః। వివాహో భోజనమ్ శాపోత్సర్గౌ మృత్యూరతమ్॥ తథాదంతచ్ఛేద్యం నఖచ్ఛేద్య మన్యద్ర్వీడాకరంచయత్। శయనాధరపానా దినగరాద్యవరోధనమ్। స్నానానులేపనేచైభిర్వర్జితః", అనిగీర్వాణనాటకలక్షణము. వర్జింపబడవలసినదని యిందునిర్ణయింపఁబడిన యంశములన్నియు వర్జింపఁబడి యున్నవిగాని, వధయును యుద్ధమును మాత్రమే ప్రదర్శింపఁబడినవి. మఱియు నిందుపాశ్చాత్యనాటక లక్షణ మింతవఱకను సరింపఁబడినదో చూతము. ఇందువిజయవిజయముకన్న కర్ణసంహారమునకే యధిక ప్రాము

ఖ్యమొసంగఁబడియున్నది కావున నిది "Tragedies" విషాదాంతనాటకములలోఁ జేరుచున్నదని చెప్పుటయే సమంజసము.

గీర్వాణనాటకములలో విసర్జింపఁబడి పాశ్చాత్య నాటకములలోఁ బ్రదర్శింపఁబడుచున్న వధయును యుద్ధము నిందుఁజేర్పఁబడినవి. ప్రాచీన నాటకలక్షణముల లోపాలోపములను చర్చించుటకు మనకధికారముకలదో లేదో నేఁజెప్ప లేనుగాని కేవలవీరరసప్రధానమగు నాటకమున యుద్ధమును వధయుఁ బ్రదర్శింపకపోవుట యేమి సమంజసముగా నుండునో నాకుఁదెలియకున్నది. ఈరెండును ప్రదర్శింపవలసినప్పుడు ప్రాచీన కాటకకర్తలు గంధర్వదంపతులను దెచ్చిపెట్టి వారిచే వర్ణింపించుచున్నారు. ఇట్లువర్ణించుట శ్రవ్యకావ్యము చేయవలసినపనిగాని దృశ్యకావ్యము చేయవలసినపనిగాదు. దృశ్యకావ్యమువ్రాయుచు దానికి ప్రధానమయిన యంశమును విడచివేయుట నేలవిడచి సాముచేయుటవంటిది. కావుననే యధునాతననాటక కర్తలీనియమంబుల నుల్లంఘించి పాశ్చాత్య లక్షణము ననుసరించుచున్నారు. ప్రాచీననాటకలక్షణమున స్థలవిభజన నియమము సమంజసముగాలేదు. కావున సుప్రసిద్ధులగు వేదము వేంకటరాయశాస్త్రిగారు, ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారు మొదలగు నాటకకర్తలు పాశ్చాత్య నాటకలక్షణములనుసరించియే, స్థలవిభజనముఁ జేసియున్నారు. శ్రీశర్మగారును వారిననుసరించియే స్థల విభజనముఁజేసియున్నారు. పాశ్చాత్యలక్షణానుసారముగా స్థల విభజనము చేయుటచే నాటకసంధుల యావశ్యకము లేకపోవుటచే నాసంధి నియమములను పాటింపకపోవుట సమంజసముగానేయున్నది. పైయంశము ల

న్నియు సమన్వయించిచూచినచో విజయవిజయ మాంధ్రభాషలో నిదివఱకే సుప్రసిద్ధములైయున్న చిత్రనళీయ ప్రతాపరుద్రీయాది నాటకముల ననుసరించి ప్రాక్పశ్చిమసుప్రశస్త నాటకలక్షణసమ్మేళనమున వ్రాయఁబడినదని నాయుద్దేశము. ఇఁకకథావిమర్శనమునకుఁబోవుదము. సుప్రసిద్ధమగు భారతేతిహాసముఁగూర్చిగాని భారతయోధులఁ గూర్చిగాని యిందుఁజర్చించుట చర్వితచర్వణము. ఇందలివృత్తము విషాదాంతమనిచెప్పుటయే సమంజసముగానున్నదని యిదివఱకే వ్రాసియున్నాను. కావున విషాదాంతవృత్తమెట్లుండవలెనో తొలుదొల్త తెలుసుకొనవలెను. ఆంధ్రభాషలో విషాదాంతనాటకము లిప్పుడిప్పుడే తలచూపుచున్నవి. కాని విషాదాంతవృత్తమననేమియో కొందఱికింకను బాగుగాబోధపడినట్లుకన్పట్టదు. చావుతోనంతమయినంతమాత్రముననే విషాదాంతమేయని వారు భావించుచున్నారు, అదిపొరబాటు. చావుతోనంతమయినంతమాత్రమున నది విషాదాంతవృత్తము కానేరదు. మృతి యొకప్రధానాంశము కూడ కాదు.

"The failure—at least the worldy failure of those from whom much might have been expected, who ought to have attained, but somehow have not the nonfulfilment or ruin of high possibilities ,of character and natural endowment." అని పాశ్చాత్యలక్షణకారులు వ్రాసియున్నారు, దీనినిబట్టి యొకానొకమహానుభా

# విజయవిజయము.

పుడు ప్రకృతివలన తనకుఁ గలిగిన మహాగుణసంపత్తిచేఁ జేయుటకు సామర్థ్యముగలిగియున్న యొక మహాకార్యమును గారణాంతరములచే నిర్వర్తింపలేకపోయిన నది విషాదాంతమని చెప్పఁబడును. ఈలక్షణమునకుఁ గర్ణుఁడు సుప్రసిద్ధుడైయున్నాఁడు. ఆమహానుభావుఁడు సూర్యవరప్రసాదజనితుఁడు. సహజకవచకుండల విరాజమానుఁడు. పరశురాముని శిష్యులలో నగ్రేసరుఁడు. ఇట్టివాఁడు చేయవలసిన మహాకార్యము పార్థసంహారము. కాని యామహాకార్యమునకు దైవిక మానుషికములయిన యంతరాయము లెన్నో కలిగినవి. ఈయంశముఁ గూర్చి కర్ణుఁడే తనయవసానకాలమున నర్జునునితో నిట్లనుచున్నాఁడు.

సీ॥ కపటభూసురవేష । గాత్రుఁడై చేసెనా । ధ్యక్షుండు
వనునిరింప । దక్షుఁడయ్యె ।
ధాత్రీసురేంద్రప । విప్రజిహ్వాహూత ।
శాపంబు జ్యాముక్తి । శాపమయ్యె ।
వరములంగాంక్షించి । పాండుభూవరునకో ।
హరిశ్రీనామెదఁ ప్రాణ । హరిశ్రీయయ్యె ।
వైరి ద్రోహియై । సారథ్యము వహించి ।
శల్యుండు హృచ్ఛల్య । తుల్యుఁడయ్యె ।
గీ॥ రథము క్రుంగె ధనస్సు నో । రథము సిద్ధిఁ ।
రెండె, నాడెందము నధృతి । డింగె, మీఁద ।
మదముఁ గూర్పఁగ కృష్ణుఁడు కాంత । మోహరుప్పె ।
గాక యున్న నే పాటిసే । కంపబలిమి ॥

కావున కర్ణునియవస్థఁ బరికింపమిక్కిలి బలశాలియైన యొక వీరుఁడు మిక్కిలివేగముగాఁ బ్రవహించుచున్న యొక ప్రవాహమునకు విధివశమున నెదురీదవలసివచ్చినప్పుడు వాని ప్రయత్నమెట్లు వ్యర్థమగునో యట్లే కర్ణునిపరాక్రమమంతయును వ్యర్థమయ్యెనది. దానికిఁ గారణము కర్ణునిపరాక్రమమునకుఁ దోడు కర్ణునియందుఁగల సుగుణసద్గుణముల సమీకరణమే కావున, కర్ణుని సుగుణావళులను మనము భేదించిచూడవలెను.

మొట్టమొదట కర్ణునిసుగుణములఁ గూర్చి యాలోచింతము.

1 కర్ణునియౌదార్యము. (ఈయంశముఁ గవి యీక్రింది పద్యమునఁ జూపియున్నాఁడు).

తనకుఁ జేఁజిక్కిన పాండవయోధవర్యుఁడగు దృష్టద్యుమ్నునిఁ గరుణించి

క॥ "విడిచితిఁ గరుణించితిఁ గ ।
వ్వడితోఁ గలచొప్పు చెప్పి । వానిం జెన్నున్ ।
వడివెన్నా సగఁ దెమ్మ ।
ప్పుడు చూపెదమగబిరుదును । పోటుఁదనంబున్ ॥"

చేఁజిక్కినవీరవరునిఁజంపుట వీరధర్మముగాదనియు కృష్ణార్జునులతోఁ బోరునప్పుడు తన పరాక్రమముఁ జూడవచ్చునని యుఁజెప్పి విడిచిపెట్టియున్నాఁడు.

2 కర్ణునిస్నేహభావము:—

ఒకానొకసమయమున శ్రీకృష్ణుఁడు కర్ణునితో నిట్లుచెప్పి యున్నాఁడు,

చం॥ తెలిపితి నీకుఁ దమ్ములకు । దీరని వైరము కీడటంచు నా ।
పలుకుల నంతయుఁన్ వినవు । పాడిఁ దలంపవు, నీవు జేనికిన్ ।
గెలుపు ఘటింపఁజాలవని । కిం జెలరేగెదు లెస్సగా ఘనిం ।
దలఁదల పైవహించెదవు । తథ్యముఁ బల్కితిఁ బాండవాగ్రజా॥

దానికి కర్ణుఁడిట్లు జవాబుచెప్పియున్నాఁడు.

చం॥ “గెలుపును జెందలేని యెడఁ । గీడ్పడిచచ్చెదఁ గాక వైరితో॥
జెలిమిఁ బొనర్ప వెంగలినె । శ్రీయును రాజ్యము మోక్షహేతువే ।
కలిమి యెఱుంగనో? ధనముఁ । గాంచనో? పేదనో? నేలనేలనో
తలఁపవు మంచిచెడ్డలను । దాతుఁడు కర్ణుడు స్వల్పచిత్తుఁడో?”॥

తనయైశ్వర్యమునకంతటికిఁ గారణభూతుఁడైన దుర్యోధనునకుఁ దాను ప్రాణములైన నీయవలసియున్నవనియు, దుర్యోధనునకు శత్రువగుటచే నర్జునుఁడు తనకును శత్రువే యనియుఁ,

తుచ్ఛమగు రాజ్యమునకాసపడి శత్రుపక్షముఁ జేరుటకన్న మృత్యువే మేలనియు దీనివలన సూచింపఁబడుచున్నది. కర్ణునకు దుర్యోధనునందుఁగల స్నేహభావమెంతయు సమంజసమైయున్నది.

3 కర్ణుని నిష్కామకర్మయోగము ;—

కీడువచ్చునని గ్రహించియు, నగ్నిహోత్రము సంబుట పాడిగాదని తనకు దుర్బోధ చేయుచున్న శల్యునితో—

"చ॥ మునుమను జూండు కార్యముల । ముఖ్యమది సెంచగరాదు ; లెస్సయె
నను చెడుఁ గైనఁ గార్యములో । నర్పుటధర్మము తత్ఫలంబు రా
జనుభవ మెందుఁ గాక ; సమ॥ రావని నాదు రథంబు క్రుంగినన్ ।
గను ప్రదోషంగు ; దోషరహి । తంబుగ నావిధి నేనొనర్చెదన్ ॥"

చెప్పియున్నాఁడు. యుద్ధమునందలి ధర్మాధర్మములతోఁ గాని జయాపజయంబులతోఁ గాని కర్ణునకుఁ బ్రసక్తి లేదు. అది రాజుగారి పని. తాను సేవకుఁడు గావున, సేవకుని విధి రాజాజ్ఞాచరణము కావున దోష రహితముగా స్వధర్మము చేయుట యుత్తమమని కణ్ణుఁడాలోచించి యారీతి నేయాచరించెను. నిష్కామకర్మమున కింతకన్న నేమి కావలెను. కర్ణునియందిట్టి సుగుణములు పెక్కులున్నవి కాని వీనికిఁ బోఁడు గొప్పలోపములు కొన్నియున్నవి. అందు మొదటిది ;—

1 తన ప్రతాపమును తానే విస్తారముగా వర్ణించుకొనుట. తన్ను దాను వర్ణించుకొనుట యొప్పదనునిందాస్పదమే. అయినను నొక్కొక్క

ప్పుడు విధిలేనిసమయమున నితరులకుఁ దనసామర్థ్యమునందు విశ్వాసముఁ గలిగించుటకై యించుకనొక్కఁ జెప్పవలసియుండును. వీరలందఱు నొక్కొక్కప్పుడట్టు చేయుచుందురు.

ఒకసమయమున భీష్ముఁడిట్లు కర్ణునితోఁ జెప్పినట్లు తిక్కన వ్రాసియున్నాఁడు.

చం॥ ముదుకడనైన నాదుబల। మున్ జలమున్ వివిధాస్త్రశస్త్రసం।
పదయును బోయినీగురువు। భార్గవుచేత నెఱింగికొమ్ము; నా।
కెదిరినవారు పెక్కుఁడల। నేమయిరో యెఱుఁగుంజగమ్ము; నా।
ముదమియు నీకుమారుతన। మున్ వరుసన్ విజయుండెఱింగెడున్।

కర్ణుఁడో మాటిమాటికిని, తనప్రతాపము నవసరమ్మయినప్పుడు కానియప్పుడు వర్ణించుకొనుచుండెను. ఉదాహరణము చూడుఁడు.

చం॥ లగ్నముఁ బెట్టినాఁడజయ। లక్ష్మిని బెండిలియాడ, నాదుబా।
ణాగ్ని వెలుంగుచుండ నెవఁ। డాహుతిఁగాక తొలంగఁ జాలును।
ద్విగ్నమనంబునన్ నరుఁడు, తేరునడిగ్గి తొలంగఁ గృష్ణునిన్।
భగ్నజిగీషుఁ జేయఁగల। వాఁడను వాడను పోరితంబునన్ ॥"

అనియొకసారియు

గీ॥ వైరివీరప్రకాండగం। భీరజలన।
పంక్తిమద్బాణపత్త్రప। భంజనంబు।
మించినట్లుడలఁ బరాక్ర । మించు నెపలఁ।
బంచబంగాళమై భీతిఁ బఱచు నన్న ॥",

# విజయవిజయము.

అని యింకొకసారియు, మఱియు నిట్లనేకసారులు వర్ణించుకొనుచుండెను. మోతాదు మించినమందు గావున నిది యున్మాదకారణమే యగుచుండెను.

2 రెండవది యతిశీఘ్రముగఁ గ్రోధావిష్టుఁడగుట కర్ణున కెల్లప్పుడు ముక్కుపైఁ గోపముండును. చీమచిటుక్కుమనిన నది పైకివచ్చుచుండును. శల్యునివలనఁ దనకు గొప్పయుపకారము కావలసియున్నది. శల్యుఁడు తన్ను మాటిమాటికి నెత్తిపొడుచుచుండుట వాస్తవమే కాని కార్యసాధకుఁడై యున్నచో కర్ణుఁడాతని మంచిమాటలచే బుజ్జగించవలసియుండఁ దన యహంభావమును విడువక;—

మ॥ మతిలేదో జ్వరసంధియుద్భవిలెనో। మద్యంబు గంజాయి త్రా।
గితివో నిన్మదినమ్మినన్ నిజముగాఁ। గీడ్పాటువాటిల్లుదు।
ర్మతి నా సారథివాటచే బ్రదికితౌరా! లేనిచో నిప్పుడే।
శితబాణాళిమహాప్రహారములనీ। శీర్షంబు ఖండింపనే?॥

అని కాని పైఁగోపించి, మఱలఁ దనపరితాపము నిట్లు వర్ణించియున్నాఁడు.

ఉ॥ దండనఁ జేరి వైరిభుజ। దండము లాక్కటఁ ద్రుంచి దివ్యనో।
దండవిముక్త కాండజని! తంబగు వహ్నిగణంబులోన వే।
దండములన్ దుగంగభట। తండములన్ దహియింపఁగన్నఁడా।
దండము నీదు తాపులకు॥ దండము దండము దండమంచునో।
ద్దండము లెత్తి మ్రొక్కెరిపు। తండము గండము దక్కియుండగన్॥

## విజయవిజయము

8 కర్ణునియందలి లోపము మితిమీరిన యాత్మవిశ్వాసము——

ఆత్మవిశ్వాసము మనుష్యున కావశ్యకమే. ఏగొప్ప కార్యమైనను తానుచేయలేనని యనుకొన్నంతకాలము చేయలేడు. చేయఁగలనను దృఢవిశ్వాస మెప్పుడుగలుగునో యప్పుడుచేయఁగలఁడు. కానియీవిషయమున వివేకముమాత్రముఁగలిగియుండవలెను. అభినవభీమసేనులఁగు కోడి రామమూర్తిగారు సహితము మోటారుబండినిలాగుటకు సామర్థ్యమున్నంతమాత్రమున నెంతయాత్మవిశ్వాసమున్నను హిమవత్పర్వతముఁ జెకలించిపారవేయఁగలరా? కాబట్టి తానేపనిచేయుటకుఁ దలఁచినను మనుష్యుఁడు మొట్టమొదట తనబలమెంత, యెదిరిబలమెంత, తాను చేయవలసిన కార్యభారమెంత యనుసంగతి నిర్ధారణగా తెలిసికొనక దుస్సాహసప్రయత్నములుచేసినచో కొనసాగనేరదు. అర్జునునిఁ జంపుటకై కర్ణుఁడు సహజకవచకుండలములతోఁ బుట్టినాఁడు. అది యింద్రుఁడు దెత్తుకొనిపోయినాఁడు. అర్జునునిఁ జంపుటకయి యింద్రుఁడొక శక్తి నిచ్చియున్నాఁడు అది ఘటోత్కచునిపై వ్యర్థమయినది. అర్జునునిఁ జంపఁగల నాగాస్త్ర మొకటి తనయొద్దనున్నది. అది యర్జునుని కిరీటము కొట్టుకొని పోవుటలో వ్యర్థమైనది తనదివ్యాయుధములన్నియు నిట్లువ్యర్థమయినను, ఫల్గుని జంపఁగలననియే చిట్టచివరవఱకు కర్ణుఁడు నమ్మియున్నాఁడు. చూడుఁడు.

గీ॥ రథము క్రుంగిన నేమి? హా! రథము లేక
యున్న నేమి? నా మేనిదు, [illegible] వాలు!
నీకు [illegible] నిను వధింతు!
[illegible] కృష్ణ! [illegible]॥

# విజయావిజయము.

అని రథము గ్రుంకినను కర్ణుఁడు పలికియేయున్నాఁడు. ఇట్టిమితిమీఱిన యాత్మవిశ్వాసము నెపోలియన్ మొదలగు మహావీరులలోఁగూడ చిట్టచివరవఱకుఁ గనుపడుచున్నదికాని యది వారివినాశనమునకే కారణమయినది. కర్ణునియందట్టిలోపము లనేకములున్నవి. కావుననే భీష్మద్రోణశల్య కృపాశ్వత్థామాది భారతవీరులందఱికి నాతనిపై నసూయ జనించినది. దీనికంతకుఁ గోడు—ఆతనికులము సుప్రసిద్ధమయిన క్షత్రియకులమున జనించియు నాతఁడు సూతకులసంభూతుఁడైనట్లు లోకమునకుగన్పట్టుట. ఇదికర్ణునిలోపముకాదు. కుంతీదేవిది. ఈలోప మెవరిదయినను భారతకథయంతయు దానిలోనేయున్నది. ఆరహస్యము కర్ణునకు, భీష్మునకుఁ గృష్ణునకుఁదప్ప మఱియెవరికిఁ దెలియదు. కావుననే కర్ణునితోడిదే భారతమైనది. ధర్మరాజున కీసంగతి తెలియకపోయినను, నంతరాత్మమాత్రమాతని వేధించుచునేయుండెను. కర్ణనిర్యాణానమయమున "కృష్ణా! కర్ణుఁడు గతించినందులకు సంతోషమునకు మాఱుదుఃఖము పొందుచున్నదని విచారింప, శ్రీకృష్ణుఁడు ప్రసంగాంతరమున దానిమఱపించెను. నైచర్యయంతయును సమన్వయించినచో, కర్ణునియుదాత్తస్వభావమంతయును గనుపట్టును. కుంతీప్రభావమున సూర్యునియనుగ్రహమున, సహజకవచకుండలవిరాజితుఁడై జన్మించినవాఁడును, మహాస్త్రశస్త్ర విదుఁడునగు కర్ణుఁడన్నివిధముల నర్జునుని జంపఁదగినవాఁడు. ఆసంగతి తెలిసి కర్ణునిమిత్రునిగాఁజేసుకొని యతనివలన భారతయుద్ధమున గెలుపొందుటకు దుర్యోధనునకు సంపూర్ణవిశ్వాసముకలదు. దానినాతఁడు మాటిమాటికిని వెలిబుచ్చుచునేయుండెను. చూడుఁడు.—

జయవిజయము.

చం॥ నడఁచనినన్ మహోగ్రుఁడగు। నాకుఁ బ్రియంబు ఘటింపుచు ముదం।
గరమునఁ జేరికింగొనఁడు। క్రౌంచవిభేదనువిక్రమంబు। భో।
చరనుత ధర్మతత్పరుఁడు। శౌర్యము ధైర్యము బాహువీర్యమున్।
దొరఁగని రాచజోదుతుల। తూఁగునె యెట్టి॥డునంగరాజుతోన్॥

కర్ణునిసామర్థ్యమునకును, దుర్యోధనుని విశ్వాసమునకును, కర్ణుని గుణాగుణములే భంగము కలిగించెను. కర్ణునియందు సుగుణములు మూడు. ఔదార్యము- స్నేహము. నిష్కామకర్మము. ఇవియన్నియు మితిమీఱినవి. ఔదార్యము మితిమీఱుటచేఁ గవచకుండలము లింద్రుఁడపహరించెను. స్నేహము మితిమీఱుటచే, బాంధవ్యమసహ్యమయ్యెను. నిష్కామము మతిమీఱుటచే స్వోజ్జృంభణమే మఱచిపోయెను. ఇఁకఁ కర్ణునియందు మూడుముఖ్యలోపములుగలవు. తనపరితాపముఁ దానేవర్ణించుకొనుట. దీనివలన నశ్వత్థామాదులతో శత్రుత్వము కలిగెను. 2 శీఘ్రముగఁ గ్రోధావిష్టుఁడగుట. దీనివలన భీష్మద్రోణాది మహావీరులతో వైరము సంభవించెను. 3 అత్యధికమయిన యాత్మవిశ్వాసము. దీనివలన భగవదంశసంభూతుఁడునగు శ్రీకృష్ణుని సహాయముగల యర్జునుని సామర్థ్యము గ్రహింపలేకపోయెను. పైలోపములబట్టి కర్ణునిబలము క్రమక్రమముగ క్షీణించినది. కర్ణునియంతిమవాక్యములు విన్నచో నెట్టిరాయియైనను కరఁగిపోవకమానదు. ఈనాటకమునంగల 126-127 పుటలపద్యములఁ బఠించినఁ దెలియును. కావున కర్ణునివృత్తము విషాదాంతమై యున్నది. ఆంధ్రభాషలో నాటకములవ్రాసినవారెవ్వరును, కర్ణుని గుణాగుణములు తె
గ్రహించి కర్ణపాత్రను చింతించినట్లు కన్పట్టదు. ఒకొక్క-క్క-రొక్క-

దుర్గుణముఁ బట్టిచిత్రించికొనిపోయిరిగాని యన్నియును సమన్వయించి చిత్రించినగ్రంథమిదియొక్కటియే మాకుగోచరించుచున్నది. పాత్రపోషణమునువిడచి యితరాంశములఁ గొన్నిచర్చించెదము. నాటకాముఖమున వ్రాయఁబడినరెండుపద్యములు ప్రశంసార్హములు.

ఉ॥ శ్రీరమణీమణీవిభుని। చెయ్వులకుందగుసూతకోలలై (1వపుట)

ఇందు "భారతకర్ణపర్వకవితారసధారలు', అనుచో వ్యంగ్యము సమంజసము. భారతమునందలివిననింపైనకవిత్వమును మీరువినియానందింతురుగాక. యనియొక యర్థమును, కాంతియందాసక్తిగలనేను ప్రదర్శింపఁబోయెడుకర్ణ పర్వమనురూపకమునందలి కవితారసమునకు మీరానందింతురుగాక యనియు యర్థము.

సీ॥ శాంతినిశ్చలమునసర్వంబుభరియించి। etc. (1వపుట)

ఇందుకర్ణునిజన్మమువలనఁగలిగినసామర్థ్యమును పరశురామునివలనఁగలిగినవిద్యాలాభమును, వానిమూడుసుగుణములు మూడుదుర్గుణములును గలిసి యెనిమిది విశేషములు తెలియఁజేయఁబడుచున్నవి ఇదికేవలవీరరసప్రధానమగుటచేఁ గవిత్వముగౌడీవృత్తి యేప్రధానముగాఁ జేసుకొనఁబడినది. ఉదాహరణము.

సీ॥ గగనకేశోత్తమాం। గనముధారసరద్ధంగా etc. (2వపుట)

ఈగ్రంథకర్తకు నితరవృత్తములకన్న శార్దూలమత్తేభములెక్కువ సౌలభ్యముతోఁ రచియింపఁగల సామర్థ్యమున్నట్లుకన్పట్టుచున్నవి.

ఈక్రిందిపద్యములు ప్రశంసార్హములు.

శా॥ క్రీడింగెల్చుట నాకశక్యమగుఁబోకీడ్పాటు వాటిల్లుఁబో (6వపుట)

# విజయవిజయము.

మ॥ తనివింజెందితి భోగభాగ్యముల మిత్రద్రోహమున్ } 55 వ,
మ॥ సరిసేయందగునో కొలానూతకులసంజాతుండు } పుట.
మ॥ కలిమింగోరిచరించు పూరుషుఁడుస్వర్గప్రాప్తికిఁదవ్వగున్ }

ఇంకను నీగ్రంథమునందుఁ జూపవలసిన విశేషములున్నవిగాని గ్రంథవిస్తరభీతిచే నిప్పుడువిరమించెదను.

## ఉపసంహారము.

పాత్రపోషణమునందును, ధారాశుద్ధియందును కొఱతలేనియిట్టినూతనరూపకమును వ్రాసినకవియును, దానినివిమర్శించిన సమాజమువారుగూడ ప్రశంసార్హులే. గ్రంథకర్త కుఁగావలసినది, గ్రంథమునందలిరసమును విద్వాంసులుగ్రహించుటగాని వేయినూట పదియారులుగాదు. ఈయంశమును గ్రంథకర్తయే యిట్లుచెప్పియున్నాడు.

మ॥ గజయూథంబులఁగోరునో యతులముక్తాహారహీరంబులన్।

(etc. 5వపుట)

సమాజమువారిట్టిగ్రంథకర్తలకుఁ దగినంతప్రోత్సాహమొసంగుటకు సిద్ధులైయున్నారు. కానిధనలోపముచే వారికోరికనెరవేరకున్నది కావున గ్రంథరచనకై తనుయానందము సూచించుచు సమాజము వారొసంగిన యీచిన్నకరస్పురహారముఁగైకొని గ్రంథకర్త మన్నింపవలయునని సమాజమువారిపక్షమున నేను ప్రార్థించుచున్నాను.

ఇట్లువిద్వద్విధేయుఁడు,

మ॥ పార్వతీశ్వరశాస్త్రి బి॥ ఏ॥



శ్రీరామాయనమః

శ్రీ

# విజయవిజయము.

—:o:—

## నాంది.

---

ఉ॥ శ్రీరమణీమణీ విభుని ♦ చెయ్యాలకుం దగు నూతకోల్లలై
వీథుల పెన్నిధానమయి ♦ విద్యకు లక్ష్మికి నాలవాలమై
భారత పుణ్యభూమిపయి ♦ భాసిలుడాలయి గ్రాలునిక్కువ
ద్భారత కర్ణపర్వ కవి ♦ తా రసధారల మీరలానుతిన్.

సీ॥ శాంతి నిశ్చలమున ♦ సర్వంబు భరియించి
ప్రాణిసంతతికి జీ ♦ వన మొసంగి
చెలువార నెనలేని ♦ తెలివిఁదే కూరిచి
వ్యాపించి జగతికిఁ ♦ బ్రాణమిచ్చి
అఖిలంబుఁ గల్ల నూ ♦ న్యంబని ప్రకటించి
కళఁబూని పంకజ కులమణంచి
విమలతేజంబునఁ ♦ దమము నివారించి
సుమనస్సులకుఁ బ్రమోదము ఘటించి

గీ॥ అష్టమూర్తు లుండియు లేని ♦ యట్టులుండి
అష్టసిద్ధు లుండియును ది ♦ గంబరుఁడయి
అసమ శరవైరియై కాని ♦ యైన యీశు
నాశ్రయింతుఁ దలంతు నే ♦

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

అహహా! ఈరాత్రి యింత శోభస్కరంబుగ నుండుటకుఁ గారణమేమి? సూదిమొన చొచ్చుటకునైన తావీయని బెజ్జములను సహితము తన కాంతిఁ జొన్పుచున్న యీ వెన్నెలయే యని యూహించెద. ఔరా! కన్నులుగలఫలముగదా? చూడంజూడఁ గవిత్వతత్వమునం దించుకంతయు నిష్టములేని మనుజుండు సహితము వర్ణింప నుత్సహించుంగదా? చూచినకొలందియు నా డెందమున కానందము మెండగుచున్నది. కొన్ని కనులకుఁ గొన్నివస్తువులు కొన్నికొన్ని సమయములయందు మున్నులేని శృంగారగరిమ కాన్పించుచుండును. అయ్యది స్త్రీజాతియందు మెండుగఁ గానందగు. అట్టుల నీ వెన్నెలయు నైయుండనోపు. (అని నలుగడల నాకసముఁ జూచుట నభినయించి) అహో! ఏమి? ఈనా మందబుద్ధి యీ స్వల్పవిషయము గ్రహింపనేరదాయె? వెలిగార మలఁదినఁ బసిండి ప్రకాశింపకుండునా? సానరాపిడిని రతనము చెలువొందకుండునా? ఆమనితతిఁ బూఁదోట శోభిల్లకుండునా? శరత్సమయమునఁ జంద్రికయు రాణిల్లకుండునా? తెలిమబ్బులుగల వినువీథిఁ గని యానందించుటయు కన్నులుగల ఫలము. (అని యాకసముఁ గాంచి) భళిరా! తెలిమబ్బులతో మెండుకొనిన యీ యాకసమునుఁ జూడంజూడ నాకుఁ గవితోద్రేకంబు గలుగుచున్నది. రసహీనమైనను దెలిమబ్బులవలె నా కవిత్వము ప్రకాశింపకుండునా?

సీ॥ గగనకేశోత్తమాం ♦ గవసుధాధర సర
ద్గంగాసరిత శం ♦ గములఠంగ

నందనోద్యాన వ ♦ నస్థిత దీర్ఘికా
పాండురజలజాత ♦ షండమనఁగ
ధారాపథాహ్వయ ♦ క్షీర పారావార
తీరసంజాత డిం ♦ డీరమనఁగ
వసుధాజనవ్రాత ♦ పానార్థ దత్తనీ
రాంబుదబృందస ♦ ద్వ్యశమనంగ
గీ॥ దత సుమేరుమందర గరు ♦ ద్ద్వంద్వవిజిత
భీకరాఖండ లాఖండ ♦ విక్రమాహి
వైరి పదనఖసంభృత ♦ భాండనిగ్ధ
శ త్సుధాకృత ధవళకీ ♦ లాసమనగ
పాండు రకాండ ముక్షండ ♦ కాండమలర.



ఉ. ఇంతటితోఁ దృప్తిఁజెందెదఁగాక. చాలు సత్రివి స్తర ముతో నేమి! పూజనీయవిద్వాంసులారా! నాభాగ్యం బెట్టిదో గాని మీర లెల్లరు నిచ్చటికి వచ్చి మమ్ముల నానందింపంజేసి మీర లానందించుటయే మీ ముఖ్యోద్దేశమని నిశ్చయించితి. నాటకం బెంతయుఁ బ్రౌఢమైన మేము నటించుటయం దెంతటి సామర్థ్యముం గలవారమయ్యుఁ గవి లోపములు నాటకము నందున్న నిరర్థకమగును. అందుచేఁ గవియు నాటకులుఁ గూడ నేర్పరులైనంగాని మీర లానందింపఁజాలరు. వెండియు నీకాలమున నాటకము రచించి కవియుఁ బ్రవర్తించి నాటకులు జనుల నానందింపఁజేయుట మిక్కిలి కష్టము. ఇక్కాలమునందు జనుల కభిరుచి వివిధ భాషాశైలులందుఁ గనంబడుచున్నది. పూర్వము జను లే శైలిని దాని...

య్యాశైలి యిక్కాలమునకుఁ గఠిన నారికేళపాకమైనది. ఇందు లకుం గారణము దేశభాషయం దభిమానము సుంతయు లేక పోవుటయే. అట్లని యెల్లరుఁ గుహనాభాషాభిమానులని వచింప. అచ్చటచ్చట మహానుభావులు లేకయుందురా? అట్టు కొలంది మందియున్న నొక లెక్కయా? స్వాభిమానము, మతాభి మానము, భాషాభిమానము, దేశాభిమానముఁ గల మానవు లమర్త్యులు. ఎల్లరు మెచ్చునట్లు పొత్తముల రచించుటకు బ్రహ్మకునైనఁ దరముగాదు. కపటభాషాభిమానులగు కువిమ ర్శకులు సంతసించునట్లు కృతుల రచించుటకుఁ బాండిత్య మన వసరము. పాండిత్యము లేకయున్న జ్ఞానము, లోకానుభవము, సజ్జన సదభిప్రాయము, దుర్జన దురభిప్రాయము గ్రహించుట యెట్లు? కువిమర్శకుండు కవిని దూషింపఁగలఁడుగాని భూషింప నేరడు. మెండియు తాను విమర్శించునట్లు భాషింపఁజాలఁడు. సాహిత్యము, లోకానుభము, గుణగ్రహణశక్తి, నిరహంకా రము, నిష్పక్షపాతబుద్ధి, సదభిప్రాయము, కవిహృదయగ్రహణ ప్రవీణత, బోధనాశక్తి, యభిమానభావమను నవనిధులం గలిగి యున్నంగాని సద్విమర్శకుండు గానేరడు. పై గుణములుగల విమర్శకులు కవులకు నిజబంధువులు. వీరలు వారల కృతిరత్న ములకు శాణోపలములవంటివారు. మీర లెల్లరు నట్టివారలని యూహించెద. లేనిచో విద్వజ్జనపరిశ్రమము గ్రహింపఁగలరా?

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్
నహి వంధ్యా విజానాతి గుర్వీమ్ ప్రసవవేదనామ్."

భాషాభిమానులారా! నేడు మేము ప్రదర్శింపనెంచిన నాటకం బెద్దియో దెలుపకయే కాల మధికప్రసంగముచే వెచ్చించితిని.

మ॥ ఇరువదియేండ్లవాఁడు కడు ♦ నింపుదలిర్చు కవిత్వమాధురీ
గరిమను కర్ణపర్వమను ♦ గాథను రూపకరూపకంబుగా
విరచనఁజేసె సూరినుత ♦ విప్రకరప్రమదప్రధానమా
కరణిని; మీర లెల్లరును ♦ గాంచి కృతార్థునిఁ జేయుడీ నను౯.

అహాహా! ఏమి నా మందబుద్ధి. పేరు దెలుపకయే కాలము వెచ్చింపుచుంటిని. విజయవిజయమను వీరరసప్రధానమైన యీ నాటకము విరచించిన కవి, భాగవతుల నృసింహశర్మ. ఈ కృతికర్త నానోర నిట్లు విన్నవించుచున్నాఁడు.

శా॥ పాండిత్యం బదియెంతయుండినను స ♦ ర్వజ్ఞత్వముం గల్గువాఁ
డొండీ విష్టపమందు లేఁడు మదిలో ♦ నూహింప దోషంబు లే
కుండన్ గ్రంథము వ్రాసి యిర్భువిని స ♦ ర్వోత్కృష్టముంజేయ ద
క్షుండెవ్వాఁడు రసంబు ముఖ్యము కృతిన్ ♦ గూర్పంగ భావించినన్.

మఱియు

మ॥ గజయూథంబులఁ గోరనో యతుల ము ♦ క్తాహార హీరంబులన్
రజితంబున్ గనకంబు నంబరములన్ ♦ గాంక్షించునో పాతకుల్
సుజనుల్ ధీరజనవ్రజంబు సుకవుల్ ♦ మోదించుటల్ పండిత
ప్రజ మేలౌనని శ్లోకసేయుటయు స ♦ ద్భాగ్యంబుగా మిన్నకున్.

మహాశయులారా! కవివిషయ మటుండనిచ్చి స్వవిషయ మించుక ముచ్చటించెదను. అనేకగ్రంథసారససారసౌరభ

గ్రహణేందిందిరులగు మీరలు మత్స్వల్పనాటకప్రయోగంబున మోదంబుఁ జెందఁజాలరనియే నేఁ దలంచెదను. ఎక్కుడు విత్తంబు వెచ్చించి పరికరముల గ్రహించియున్నంగాని నాటకము రక్తిఁ జెందనేరదు. అయిన నా యోపినంతదనుక ప్రయత్నించెద. ఆర్యులారా!

ఉ॥ నాటకమందు నేర్పరియ ♦ నంగ యశంబు వహించినాడ నే
నాటికి లోపముండ దయి ♦ నన్ నను నమ్మిన మీకు నుంతయుక్
వాటిలదేమొ మోదమని ♦ నామది సందియ మొందుచుంటిఁ బో
రాటమునందు శంగవిభు ♦ నాసఁ బెనంగిన రాజు నెంచినన్.

(తెరలో) ఓరోరి! ఉన్మత్తప్రలాపా!

మ॥ విలుతన్మందర వేష్టితాహివదనా ♦ విర్భూత నిశ్వాస చం
చల వాతజ్వలితోగ్రహాలహల ప ♦ శ్యత్ఫాలనేత్రాగ్ని క్షి
లలకుక్కాగాక లోపంగు రౌద్రరసముల్ ♦ రాగిల్లు నా వాలుఁజా
ఫుల కొంజాయకుఁ జిక్కి నీకు తొలఁగున్ ♦ భూలోకసంచారముల్.

సూ:—అహో! నటితో నించుక ముచ్చటింపవలెనని యను కొంటినే? "పోరాటమునందు నంగవిభు నాసఁ బెనంగిన రాజు నెంచినన్" అను నా పలుకుల విని మహోగ్రుండై శర్మిండదె వచ్చుచున్నాడు. ఇచట నేనుండఁజనదు. సభ్యులారా! ఇదే నా వందన మనుగ్రహింపుఁడు.

(అని సూత్రధారుఁడు నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.

(అనంతరము "విలుతన్మందర వేష్టితాహి... అను వెనుకటి పద్యముఁ జదువుచుఁ గర్ణుఁడు ఖడ్గపాణియై ప్రవేశించును.)

కర్ణు:—ఎవ్వఁడు నిచ్చటఁ గానరాఁడె. మదీయ కంఠధ్వని విని యాభీరువు పిక్కబలిమిం జూపియుండనోపు. ఔరా! లోకము పలుతెఱంగులనుండుఁగదా! నేను సైన్యాధిపత్యము వహింపకుండగనే లోకమెల్లు వాకొనుచున్నది. సైన్యాధిపత్యము నీవు వహింపుమని దుర్యోధనుఁడు నన్ను నిర్బంధము సేయుచున్నను నేనందుల కంగీకరింపకుంటిని. లోకము మెప్పింప నెవ్వఁడోపు? ఎట్టిప్రాణియు నందుల కోపదు.

గీ॥ భర్త నెడఁబాసి జానకి ♦ వత్సరంబు
వాసముంజేసె నయ్యాది ♦ దోసమనిరి
అగ్ని ముఖమున శుచియాట ♦ నరయరైరి
ఔర! జనముల మెప్పింప ♦ నగునె నాకు.

"కౌరవేశు చెలిమిఁ ద్రోపుచ్చి కౌంతేయులతో సఖ్యముం జేయుదేని భూచక్రమెల్ల నీ వశముం జేయుదు. ద్రౌపదియు నీకు భార్యయగున"ని నాడు కృష్ణుండు పలుతెఱంగుల బోధించి నన్ను బ్రతిమాలినను నే నొల్లకుంటి. అయినను లోకము నన్ను దూషింపుచున్నది. ఊఁ నాకీ లోకముతో నేమి? ఆహా! అమంగళము శాంతించుగాక. యుద్ధ మెన్నిభంగులఁజూచినను లోకమునకు నష్టమాపాదించును. నాడు శ్రీకృష్ణుండు సంధిఁగావింప వచ్చినట్లు నటించి యుద్ధము నిశ్చయముఁ జేసుకొనిపోయె. తాను పలికినపల్కులు సంధిసంధిలం జేయునవియా? మీఁదు

మిక్కిలి యీ యుద్ధమునకుం గారణము నేనని యందురు. (ఇంచుక విచార మభినయించి) ఈ భరతఖండమునకు ము న్నెట్టిగతి రానున్నదో? అన్యోన్యకలహంబున దేశము క్షీణింప కుండునా?

ఉ॥ భారతమాత! నీ సుతులు ♦ భండన కౌతుకబుద్ధితోన ని
ష్కారణ వైరమూని ధన ♦ కాంక్షను బోరుచునుండి రిందుకుం
గారకుఁ డెవ్వఁడో యెఱుఁగ ♦ గాఁదగుఁ గృష్ణుఁడయంచు నాతలన్
భారత యుద్ధ మొప్పెనను ♦ పల్కుల నమ్మకుమమ్మ మ్రొక్కెదన్.

హా! కృష్ణా! ఎంతపనిచేసితివి.

(వెంటనే కృష్ణుఁడు ప్రవేశించి)

నే నేమిచేసితిని. నేఁ జేసిన దెంతటిది.

కర్ణు:—ఏమిచేసితివో నీవెఱుఁగవా నీహృదయమెఱుఁగదా?

కృష్ణు:—సరియే. ఈ యుద్ధమునకుం గారణము నేనయని యందువో? నేఁజెప్పినట్లు నీవు వినియుండిన యుద్ధము సంభ వించియుండునా?

కర్ణు:—నీవుచేయు దుర్బోధన లంగీకరించి మిత్రద్రోహము రాజద్రోహముఁ జేసి వైరులతోఁ జెలిమిఁ గూర్పవలయు నేమి?

కృష్ణు:—నీకు వైరు లెవరు?

కర్ణు:—పాండవులు.

కృష్ణు:—ఎంతఘోరము. నీ సోదరులు నీకు వైరులా? నీ సోదర వైరులగు కౌరవులు నీకు మిత్రులా? కర్ణా! సుంతయు నాలోచింపక పలుకుచుంటివి. స్వవినాశమునకుఁ బాల్పడు చుంటివిసుమా? తఱచుగ వచ్చి నీకు గ్రుచ్చిగ్రుచ్చి చెప్పుట నీయందు నాకుఁగల యభిమానమేసుమా?

కర్ణు:—పాండవులతోఁ గలయుమని నీవు నన్ను నిర్బంధింప నేల? కర్ణుఁడు మీ కగ్రజుఁడు. వానితో వైరము మీకుఁ దగదు. చెలిమి వాటింపుడని పాండవులతో నీవేల దెలుప రాదు.

కృష్ణు:—వారు నీతోఁగలియకున్న వారలకు వచ్చుహానియేమి?

కర్ణు:—నేఁగలియకున్న నాకుమాత్రము హానిగలదా!

కృష్ణు:—అందులకొక సందియమా?

కర్ణు:—ఆ హాని యెట్టిదియో దెలుపుము.

కృష్ణు:—తెలుపవలెఁగా? వినుము. అందొకటి యపజయము. రెండవది మృత్యువు.

కర్ణు:—ఎవనిచే?

కృష్ణు:—ఎఱిఁగియుండియు వెండియుఁ బ్రశ్నింపనేల? విచిత్ర హారుఁడగు నరునిచే.

కర్ణు:—నరుఁడా నన్ను వధింపఁగలఁడు. (కోపముతో)

మ॥ అరుణంబై ప్రళయాగ్నికుండ మనఁగా ♦ నాస్యంబు కెంధామగా  
నిరసించన్ లయకాల కాలనయనా ♦ గ్ని జ్వాలయన్ భాతి భీ

కరమై కన్నులఁ గెంపుఁదోఁపరథినై ◆ కాండాసనంబూనినన్
నరుఁడైనన్ గురుఁడైన లేక హరుఁడై ◆ నన్ నాకు లక్ష్యంబొకో॥

కృష్ణు:—పాండవయోధనికరంబులో నొక సాధారణ వీరుఁడు పలుకఁదగినపలుకు లియ్యవి. ఈ పలుకుల కేమి. నీవు వెన్నుఁ జూపి పరుగిడిన నర్జునుండు విడచిపుచ్చునేమో? అట్లయ్యు నపజయము తప్పదుగదా?

కర్ణు:—కృష్ణా! విపరీతముఁ బల్కుచుంటివి. మాకపజయమా?

గీ॥ మద్భుజభ్రమితోద్దండ ◆ మండలాగ్ర
నిశితధారానిహత ధర ◆ ణీధవేంద్ర
మస్తకన్యస్త కోటీర ◆ మణిఘృణులు
విజయలక్ష్మికి నివ్వాళి ◆ విధముఁ గ్రాలు.

నీవు భీతిఁగొలుపునంతమాత్రమున వైరులపక్షఁ జేరుదునా? కృష్ణా! నామనోభిప్రాయ మెఱింగియుఁ దఱుచుగ నీవువచ్చి నన్ను నిర్బంధముఁ జేయనేల?

కృష్ణు:—వలదు వలదు. కర్ణా! మునువచ్చుకీడుఁ దలంపుము. నన్ను దూషింపఁగలవు.

చం॥ తెలిసితి నీమదమ్ములను ◆ దీని వైరము కేపటంచు నా
పలుకులనుంతయున్ వినవు ◆ పాడిఁ దలంపవు నీవు తీనికిఁ
గెలుపునుటింపఁ జాలనని ◆ కిన్ జెలకేసెదు లెస్సగాదు నిం
దలఁ దలఁపెన హించెదవు ◆ తక్కుముదిక్కఁ బొందవా గజా.

పాండవుల చెలిమిఁగోరుమవేని మున్ను రాఁగల వైభవమెల్ల
నే దెలిపెదవినుము. అప్పుడైన నన్నుమన్నించెదుగాక.

॥ గాండివముంగలట్టిత్రిజ ♦ గన్నుత బాహుబలుండు క్రీడి త
మ్ముండయి నీపదంబులకు ♦ మ్రొక్కుఁను భక్తిని ధర్మజుండు నీ
యండను గొల్చుచుండుఁ గవ ♦ లర్మిలి సేవకులై చరింతు రు
ద్దండబలుండు భీముఁడు ప ♦ దంబులనొత్తుచునుండు భాగ్యవం
తుండవు రుక్మిణీపతియు ♦ దోసిలియొగ్గును పాండవాగ్రజా.

కర్ణ:—కృష్ణా! నన్నెఱింగియుఁ బలుతెఱంగులు నుడువనేల!
పాండవులు నాసోదరులని నేనెఱుంగనా? చావునకుభీతిల్లెదనా?

॥ గెలుపును జెందలేనియెడఁ ♦ గీడ్పడిచచ్చెదఁగాక వైరితోఁ
జెలిమిఁబొనర్ప జెంగలినె! ♦ శ్రీయును రాజ్యము మోక్షహేతువే
కలిమియెఱుంగనో ఘనముఁ ♦ గాంచనొ నేలనేలనో
తలఁపవొ మంచిచెడ్డలను ♦ దారుఁడు కర్ణుఁడు స్వల్పచిత్తుఁడో.

(అని కర్ణుఁడెయ్యదియో విచారించునట్లు నటించును.)

కృష్ణ:—అట్లనా! ఎంతనిబ్బరముఁగలవాఁడవు.

లెదుసుమా విరోధము ప్రభుత్వంబు వహించెద వేటివంచు లో
లరెదు; బమ్మ యమ్మమగఁ ♦ డైనను కిరీడికి మ్రొక్కి—తీరు; నీ
లిమియు రిత్తవోవు బలు ♦ వాఁడి మగండగు మిత్రు గాంగయే
లనెలఁబోయెఁ గిరీడిఁగని ♦ పెప్పె పె యందువు సూతనందనా.

గ సాధించెదవో యెఱుంగవుగదా ♦ బాంధవ్య భావంబు మే
గునా వైరమునన్; దలంపవలదా ♦ యన్యాయమో న్యాయమో

తగునే కౌరవరాజసఖ్యమున సో ♦ దర్యంబు వమ్మయ్యెనే?
భగవంతుండు జయంబ ధర్మమున నా ♦ పాదించు నజ్ఞానియే.

(తనలో) కర్ణుండు బ్రతికియున్న జయము సందియము. ఇతని నర్జునుఁడు మీఱుటయుఁ గష్టము. కష్టమ్ముపై కర్ణుఁడు గతించినను పాండవులు మునుమున్న నన్ను దూషింపఁగలరు. నేఁజేయు ప్రయత్నము లితనివిషయమై నిష్ఫలములైనవి. అగుఁగాక. నాదోస మేమున్నది. (అని యించుక విచార మభినయించి, (ప్రకాశముగ) కర్ణా! అనేకభంగుల నే నోపునంత దనుక బోధించితిని. పాండవులతోఁ గలసిమెలసిన లోకము లన్నియుఁ గొనియాడును. ఇఁక నీయిష్టము. దొడ్డకొంచెముల బాగుగ విమర్శింపుము. పాండవశిబిరంబుననో లేనియెడ సంగరంబుననో గలయుదము.

(అని నిష్క్రమించును.)

కర్ణ:—(విచారముతో) అహహా! నాగతి యెట్లున్నది. ఏకగర్భజనితులగు సోదరులతోఁ గయ్యము. లేనియెడ మిత్రద్రోహముఁ బైపెచ్చు రాజద్రోహము. బాల్యమునుండియు సోదరులమై మిత్రవాత్సల్యమున, నన్యోన్యానురాగమున వర్ధిల్లుచున్న దుర్యోధను విడిచి యా గర్భవైరులగు పాండవులతోఁ జెలిమిఁగూర్చుటకు నేఁజేసిన పాపమెట్టిది. పాపముఁ జేసినవాఁడనగుటచే నాగతి యిట్లున్నది.

ఉ॥ వీరులు భీతిలన్ గలువ ♦ విందుకొలంబునఁ బుట్టినట్టి హం
వీరుఁడనయ్యు సూతుఁడనఁ ♦ జేరువహించితి నాదుపాప మీ

తీరున నాకుఁ దమ్ములకుఁ ♦ దీరని వైరముఁగూర్చె గూఢసం
చారమునన్ జనించు జన ♦ సత్తము దుస్థితి యిట్టిదౌఁగదా.

పాండవులు నాకు సోదరులని తెలియుటయే గొప్ప ముప్పయినది. నాకీ బాంధవ్యము తెలియకున్నచో నెంతయు మేలైయుండును. నా కెంతటి యనర్థము వాటిల్లినది?

కం॥నరుని ముఖాంబుజాతము గ ♦ నంబడకున్నతఁడెన్ మనంబు న
స్థిరధృతిఁజెంది యున్నరువ ♦ ధింపుటకుం గడు నుత్సహించు సం
గరమున వాని నెమ్మొగముఁ ♦ గాంచినఁ గేలు వణంకుచుండు ము
మ్మరముగఁ దమ్ముఁడంచు నభిమానము నెకొనెను కారణంబునన్.

ఓహో! మఱచితినే? గణాధిపకులుఁ, బ్రుతనాధిపతులుఁ జమూపతులు మొదలగువార లెల్లరు సభకు రావలయునని దుర్యోధనుఁ డాజ్ఞాపించియుండెను. కాల మతిక్రమింపుచున్నది. నేఁ జేయఁదగు విధి దోషరహితముగ నెరవేర్చెదంగాక. ఈ విచారములు నన్ను విడుచునవిగావు.

(అని నిష్క్రమించును.)

రంగము.—కురుక్షేత్రము. దుర్యోధనుని శిబిరము.

—:ప్రవేశము:—

దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, కర్ణుఁడు, శకుని, శల్యుఁ
వృషసేనుఁడు, సత్యసేనుఁడు, క్షేమధూర్తి,
దండధారుఁడు, విందుఁడు మఱియు నితరవీరులు.

---

దుర్యో:—(తనలో)

ఉ॥కూలె సురాపగాసుతుఁడు ♦ కూలె ఘటోద్భవుఁ డింక పైని యే
లీలజయంబు చేకుర ఘ ♦ లింపని భూమివిధాన నయ్యె నా
యాలము డెందమంగ విభు ♦ నాసఁ బెనంగుచునుండె నక్కటా
బేలరి నై చెలంగితిని ♦ పెద్దల సుద్దులఁ గ్రిణి సేయుచున్.

(ప్రకాశముగా) ఓ కౌరవవీరవరేణ్యులారా!

కం॥మానప్రాణంబులకును
హాని కలుగనున్న జగము ♦ లట్టిటు లైనన్
భానుఁడు దల క్రిందైనను
మానధనులు పూనిక నెఱప ♦ మానరుగా దే.

భారద్వాజుండు వైరుల కపటోపాయంబులచే గతించిన
ధైర్యంబుఁ బోనాడక పోరాడసమకట్టితి. సత్వరంబున నీ సై
సైన్యాధిపత్యము వహింపదగినవార లెవ్వరో మీర లూహిం
వలయు.

దుశ్శా:—అన్నయ్యా! ఊహించుట కేమున్నది. నీవు నిణ
యించినవానిఁ గాదన నేరితరము. నీ యిచ్చవచ్చునటు
గానింపుము.

శల్య:—దుశ్శాసనా! మృదుత్వము నీ నోర నున్నది. కడు బాగుగఁ జెప్పితివి.

కర్ణ:—శల్యా! విమర్శించుటకు నీయంతటివాఁడు గలఁడా? అతఁడు పల్కినది రాజునాజ్ఞ ననుసరించియేగదా? అందు దోసమే మున్నది.

క్షేమ:—రారాజా! నే మొనకాఁడనై సేవంత మానిపి వైరుల నశింపజేసి భీష్మద్రోణులు లేనికొఱంత యావంతయిన లేకుండ నేఁ జేయఁగలవాఁడ. మద్బలసాహసంబు లీ వెఱుంగనివే?

ఉ॥ వాలికతూపులన్ బఱపి ♦ వైరుల నందఱ ద్రుంచఁజేసి శుం
డాలములన్ వధించి సుభ ♦ టప్రకరంబుల స్యందనంబులన్
డీలుపడంగ డీకొనిక ♦ డిందిమగంటిమిఁ జూపి పొల్చెదన్.
వాలుమగల్ మనంబులను ♦ వాఁడిమి వేఁడిమి వీడి భీతిలన్.

ఉత్సాహ॥ భిండివాలమూనికేల ♦ భీతిఁ దక్కి నిల్వ బ్ర
హ్మాండప భాండకోటు లల్ల ♦ నల్లఁ దల్లడిల్లవే
ఖండనంబునం దెదుర్చు ♦ పాండుపుత్రు లెల్ల దు
ద్దండమండంచుఁ దాకవెఱచి ♦ దర్ప మొసఁగ వేసరే.

శల్య:—క్షేమధూర్తీ! సైన్యాధిపత్యమునకుఁ దగినట్లు పలికితివి.

దండ:—(తనలో) ఈ శల్యుఁడు నాపలుకులంగూడ ఖండించునాయేమి. (ప్రకాశముగా) రాజా!

ఉత్సాహ॥ మసఁగి భీర మెసఁగ సేన ♦ మల్ల చఱచియేపు మైఁ
గసిమసంగి సైన్యములను ♦ కడిమిఁ జెండుచుండఁగన్

మిసిమివీడి నన్నుఁ గాంచి ♦ మేటిమగఁడటంచు నల్
దెసలఁ బాఱి బీరమెడలఁ ♦ దెంపుఁ బెంపుఁ ద్రెంపరే.

శల్యు:—దండధారా! ఈ పలుకు లర్జునుండు వినియున్న మందహాసముఁ జేసి మెచ్చుకొనును.

శకు:—(తనలో) ఏమి యీ శల్యుని యాగడము. వీరు నందఱుఁ దృణీకరింపుచున్నాఁడే.

కర్ణు:—(తనలో) శల్యుని యభిప్రాయము గంభీరము నున్నదే! ఇతఁడు పాండవపక్షపాతియాయేమి?

విందు:—భూవరా! శీర్షముండగ మోకాలిపూజయేల?

చం॥ అలవున బల్లిదంబులగు ♦ నమ్ములు రమ్ముల దూసివిచ్చి యా
వలఁ జెలరేగి యేనుఁగుల ♦ పైపడి రాపడి రూపుమాపి లా
వలరఁగ వీర తల్లజుల ♦ నల్లన నెల్లెడఁ ద్రెళ్లనేసినన్
గలఁగుచు సేన గీన మఱి ♦ గాండివి గిండివి వెన్నునూపరే.

శల్యు:—ఓహో! విందుఁడందఱిని మీఱి పలుకుచున్నాఁడే.

క్షేమ:—మద్రభూవరా! నీ నిరసనము మితిమీఱుచున్నది సైన్యాధిపత్యంబునకు నేఁదగనో?

ఉ॥ మేటిమగండనై రథము ♦ మీఁద ధనుస్సును బూని నిల్చి నే
హాటకపుంఖబాణజని ♦ తాగ్నిమహోజ్జ్వలకీలలన్ నిరా
ఘాటముగా నరాతి నృప ♦ కాననమున్ దహియింపుచుండ నే
పోటరి మిన్నయైన రణ ♦ భూతలమందున నిల్వనేర్చునే?

దండ:—(రోషముతో) శల్యా! నీ వెంతటి వీరుండవో గాని మమ్ముల నందఱ దూషింపుచుంటివి. యుద్ధంబునఁ బుట్టి పెరిగిన మేము సైన్యాధిపత్యంబునకుఁ దగమో?

మత్త కోకిల॥ ముక్కలంబుగ వాఁడితూపులఁ ♦ బోటుబంటులఁ దాకినన్
వెక్కసంబును బొందిపాఱరె ♦ భీతిచేఁ గడుదీనులై
ఒక్కతూపునఁ గాల్బలంబు మ ♦ ఱొక్కటన్ బడవాలురన్
జెక్కుచుండగ నిక్కడక్కడఁ ♦ జిక్కిచావరె పాండవుల్.

శల్యు:—పాండవులే చిక్కి చచ్చెదరా? ఓహో! అట్లయిన నిది యొక నూతనాంశము.

దుర్యో:—(తనలో) శల్యుఁడు మితిమీరుచున్నాఁడే. నే నుందలించిన నొచ్చుకొనునేమో? ఇంచుక శాంతించెదంగాక.

కర్ణు:—శల్యా! నీ యభిప్రాయ మేమి?

వింద:—శల్యుని యభిప్రాయముఁ దెలియుట కే మున్నది. అందఱుఁ బిఱికిపందలు. తా నొక్కండే మహావీరుఁడు.

శకుని:—బాగుగఁ జెప్పితివి.

శల్య:—కురుభూపాలా! వేవురు బహుభంగుల నెట్లుభాషించినను మద్రజనకుండగు నంగభూపాలుండు సైన్యాధిపత్యమునకుం దగినవాఁడని నీ వెఱుంగవా?

కృప:—రాజా! పిన్నవాఁడైనను మదీయసోదరుండు సత్యసేనుండు సత్యమునే పలికెను.

అశ్వ:—నేనీ బాలవీరులతో నేకీభవించెదను.

శల్యు:—అంతకన్న కావలసిన దేమున్నది.

దుర్యో:—శల్యా! ఇందుగల వీరులలో సైన్యాధిపత్యమునకుం దగినవార లెవరని నీ యభిప్రాయము.

శల్యు:—పాండవు లెవ్వరినిం దనుమకుండ యుద్ధముం జేయుచు రేని విలుంబూనిన ప్రతివీరుండు సైన్యాధిపత్యమునకుం దగిన వాండగునని నా యభిప్రాయము.

క్షేమ:—అబ్బా! శల్యుం డెంతటి ప్రతిభావంతుండు.

విందు:—వినుచుండుము. వినువార లున్న నిట్టిపలుకులు మన శల్యునినోర నూరుచుండును.

దుర్యో:—మద్రభూనాథా! అట్లుకాదు. భవన్నిశ్చితాభిప్రాయము మాకుం గావలసియున్నది.

శల్యు:—అట్లయినం గర్ణుని యభిప్రాయ మెట్టిదో తొలుత నే గ్రహించినంగాని నుడువంజాలను.

కర్ణ:—నిష్కపటముగ మదభిప్రాయముం దొలుత రారాజు నకుం దెలిపితినే. నే సైన్యాధిపతినై యెట్లు యుద్ధముం జేయుదునో సైన్యాధిపతిం గాకయున్న నట్లనేం బోరెదను. అందుచే నా యభిప్రాయ మేమనం బాండవులు తన జనకునిం జంపిరను దుఃఖాగ్నిచేం గ్రోధాగ్నిచేం గ్రాగుచున్న యశ్వత్థామ సైన్యాధిపతియైన వానికిం దోడు నేనున్న లాభకరముగ నుండుననియే.

కృపి:—కడు బాగుగనున్నది.

శల్యు:—(తనలో) ఔరా! కర్ణుని బుద్ధిచాతుర్యము. అశ్వత్థామ సైన్యాధిపతియై వానికిందోడుగఁ గర్ణుఁడున్నఁ బాండవులు విపత్తిఁ బడఁగలరు. (ప్రకాశముగా) కురునాథా! కర్ణుని యభిప్రాయము బాగుగనే యున్నది. కాని నా...

దుర్యో:—శల్యా! బ్రాహ్మణవీరులయందు మాకు నమ్మకము నశించినది.

శల్యు:—(తనలో) నే ననుఁదలఁచుకొనినది యితఁడే పలికెను. (ప్రకాశముగ) అట్లయినచో నీ యభిప్రాయమేమి?

దుర్యో:—కర్ణుఁడుగాని లేక నీవుగాని వహించిన లెస్సగ నుండును.

శకు:—సరియే. అట్లయినఁ గర్ణుండిందు కంగీకరించును. అతఁడు సైన్యాధిపతిగ నుండుటయే లెస్స.

దుశ్శా:—నా యభిప్రాయముగూడ నింతియే.

శా॥ శుంభన్నేమ్రఘురవంబు భంగిఁ గపన ◆ క్షోణీతలంబందు సం
రంభప్రక్రియ దుందుభుల్ సెలఁగ నీ ◆ రాధేయుఁ డుగ్రాకృతిన్
గంభీరోజ్జ్వలచాపరోపణయుఁడై ◆ గర్జింపుచున్ నిర్భిన్నఙ్ఞ
జంబధ్వంసియు వెన్నుసూపునచో ◆ సందేహ మొందుండునే.

శల్యు:—కర్ణుఁడుగాని లేక నేనుగాని సైన్యాధిపత్యము వహించిన లెస్సగ నుండునని నీ యభిప్రాయమైనచోఁ గర్ణుఁడా యాధిపత్యము వహించుఁగాక.

క్షేమ:—శల్యా! కర్ణుఁ డాధిపత్యము వహించుగాఁక యని నీవు నుడువనక్కఱలేదు. అతఁడే యాధిపత్యము వహించు నని మున్నే మే మెఱుంగుదుము.

విందు:—అందులకు సందేహ మేమి? సైన్యాధిపత్యము వహించుటకు నతనికన్న మేటిపోటరి కురుసైన్యంబునంగలఁడా?

దుర్యో:—మిత్రమా! అంగరాజా!

ఉ॥ మానధనుండు, శూరుఁ డస ♦ మానపరాక్రమనిర్జితారి, తే
జోనిధి, కుంభసంభవుఁడు ♦ క్రుంకెఁగదా? నిను నమ్మినాడనో
ప్రాణసఖుండ! వేగమె య ♦ పాయములేని యుపాయ మొండు డెం
దానఁదలంచి కౌరవశ ♦ తంబునకున్ విజయంబుఁ గూర్పుమీ.

కర్ణ:—మిత్రమా! ఎన్నటికైన మనల కపాయం బొందు వాటిల్లినంగదా యుపాయంబు లన్వేషించుట.

శల్యు:—అపాయంబు వాటిల్లకయున్నదియేమి. ముప్పాతిక మువ్వంతుల సైన్యము నశించెఁగదా! కర్ణా! రారాజున కఱచేత వైకుంఠముఁ జూపుచుంటివే?

విందు:—తేనియలొలుకం బలుకులంబలికి మెప్పింపంగల చాతుర్యము మన యంగభూపాలునకుం దక్క యితరులకుం గలుగ నేరదు.

శకు:—పాకము ముదురుచున్నదే?

కర్ణ:—కురువీరు లెల్లరు నధిక ప్రసంగమునకుం గడంగుటకుఁ గారణమేమియో? శల్యా! నీ వక్రవాగ్ధోరణిఁ జాలింపుము.

దుర్యో:—నెచ్చెలీ! వారిపలుకులంబాటింపకుము. భవచ్ఛౌర్యం బుఁ జూపింపఁ దగినకాల మాసన్న మయ్యెను.

దుశ్శా:—అన్నయ్యా! మన కర్ణునకు నీవింత నొక్కి చెప్ప వలెనా?

శల్యు:—చెప్పనేల? అంతయుఁ గర్ణుఁడు నెఱవేర్చును.

కర్ణు:—కురునాథా! నీ స్నేహంబుచేఁగదా వర్ధిల్లితి. శాత్ర వోద్ఘాటనంబు కర్ణునకు హస్తగతవైభూతంబుగదా?

దుర్యో:—సైన్యాధిపత్యమునకుం గర్ణుండు తగునని నా యభిప్రాయము.

శకు:—నాయభిప్రాయ మింతియే.

దుశ్శా:—నే నందులకు సమ్మతించెద.

వృష, సత్య:—తొలుఁదొలుత నేమాయభిప్రాయముఁ దెలిపితిమి

సింధు:—తగిన క్షత్రియోత్తముండు తగునని నాయభిప్రాయము

క్షేమ:—ఈ చేయంబోవు కార్యమున కాలోచన కర్తవ్యం బని నాతలంపు.

దండ:—క్షేమధూర్తి నిక్కము వక్కాణించెను. నా తలంపు నింతియ.

శల్యు:—దుర్యోధనా! నీ యిచ్ఛకువచ్చునటులం గావింపుము. వలదని యనువార లెవరు?

సీ॥ రూపవద్రిపు ష్పా ♦ రుషమూర్తి కేముఖీ సు
భయద మార్తాండ బిం ♦ బంబుఁబోల

చ॥ ఉడుఁగక యెవ్వరెట్లనిన ♦ నూఁకొని యుండెదనట్లగాని యీ
నడవడి లెస్సగాదని య ♦ నం దలపెట్టవు; సూతసూనుఁడ
ట్టిఁడయగు టెంతయుక్త సరిప ♦ డెన్ జెడుచెయ్దము లెల్ల వీఁడు వీ
యెడఁదలయందు మేల్మి జని ♦ యింపదు ముక్కుల నూర్పులుంపగన్.

క్షేమ:—(దండధారునితో రహస్యముగ) బీరంబులం బల్కెడియీ కర్ణుఁడు సైన్యాధిపతియయ్యెను. ఉక్తులేకదా సదా సర్వకార్యంబులకు మూలాధారంబులు.

దండ:—క్షేమధూర్తీ! నీ వట్లనఁజనదు. నిశ్చయముగ సజ్జనుని మార్కొనఁదగు వీరుఁడు కర్ణుఁడుగాక మ ఱెవ్వఁడు గలడు!

సత్య:—మద్రభూవరా! మా జనకుండు సైన్యాధిపతిగ నుండుట నీ కనిష్టమైన నిట్లనఁజనునా?

వృష:—శల్యున కనిష్టమైన నిష్టముగా వర్తించువార లెవరు?

కర్ణ:—రా రాజా! ఈ శల్యుని పలుకుల కులుకం బోకుము.

మ॥ పసయే పాటిగలట్టి మేటిమగలో ♦ పాండవ్య యోధావళిన్
దెసలం బాఱఁగఁజేసి మద్భుజ బలో ♦ త్సేకంబునుం జూపి క్రొ
వ్వెసలారన్ వడివాఁడి తూపులను లా ♦ వింకంగఁ బోరాడి నీ
కసిదీరన్ మసిఁజేసి వారలఁగడున్ ♦ గారించి కేరించెదన్.

క్షేమ:—(దండధారునితో) వింటివా కర్ణుని ప్రల్లదంబులు.

దండ:—అయ్యావి నీవు నేనుం బలికినఁ బ్రల్లదంబు లగుఁగాని కర్ణుఁడు వచించినఁ బ్రల్లదంబు లగునా? ఓయీ! క్షేమధూర్తీ! కర్ణునిఁ బరిహాసింపుటకు మనము తగము. శల్యుఁ డేమిడియో పలుకఁబోవును. వినుము.

శల్యు:—కర్ణా! బాహాటంబుగ మేటిపోటరి నైవడిఁ బల్కుచుంటివి. నీ బలసామర్థ్యం బెట్టిదో తెలియఁజేయుము. వీనులార విని సంతసించెద.

కర్ణు:—(మందహాసముతో) శల్యా! నా బాహుపరాక్రమక్రమము నీకిపు డెట్లు తెలియును.

ఉ॥ నాటకమందు నెట్లు నట ♦ నంబుఁ బొనర్చెదు చెప్పుమన్నచో
మాటలఁ దెల్పనే నటుఁడు ♦ మాదిరిఁ జూపునుఁగాక యట్టులే
పోటరి యిన్న తా నెటులు ♦ పోరునొ పల్కునె? భీతిఁ గొల్పు పో
రాటమునందు వాఁడిమిఁ గ్రి ♦ యన్ బ్రకటింపక రిత్త పల్కులన్.

శల్యా! మన్మనోధైర్యము నీ వెఱింగియు యెఱుంగక యో నన్నుఁ గ్రిందుసేయుతలంపున నెగ్గులాడుచుంటివి. యుద్ధారంభమునుండి యర్జునుఁడు సూపిన విక్రమ మెవ్వ రెఱుంగనిది. చక్రంబు వహింపనని పలికిన కృష్ణుఁడు చక్రంబుఁ బూనుట నరుని విక్రమంబునకుఁ గొఱంతయగదా? అప్పుడైన వీరోచితముగ భీష్ముని వధింపఁగలిగెనా? లోకంబునంగల యా బాలగోపాల మీ విషయ మెఱుంగనిదియా? అదియటులుండఁ గుంభసంభవు వధించిరా? కల్లలంబలికి యన్యాయముగఁ జంపుట వీరపురుషోచితమా? శల్యా! సన్నెఱుంగవుగనుక, కోరినవాఁడ వగుటచేఁ బలుకుచుంటిని నా మనోనిశ్చయ మెఱుంగుము.

సీ॥ కొండపైనుండు తా ♦ బంపఁ గ్రిందుగఁ ద్రోసి
కెరలి కోరాడు నొం ♦ టరియనంగ
వొండుమాటున డాగి ♦ యుండు వేఁటరిఁ గాంచి
బలిమి లంఘించు కొ్రి ♦ ల్బ్బులియనంగ

వనసత్త్వములు పంచ ♦ బంగాళమై పాఱఁ
గాంతారముం గ్రుమ్మ ♦ ఖడ్గమనఁగ
మాఱికులంగూల్చెడి ♦ మదపుటేనుఁగుఁ జీల్పఁ
జివ్వునఁ గుప్పించు ♦ సింహమనగ

గీ॥ ప్రళయకాలాంబుదచ్ఛటా ♦ పటునినాద
భాంకరణ శంఖరవముతో ♦ హుంకరించి
మించి కుప్పించి విప్వచ్చు ♦ మేనుఁ ద్రుంచి
వచ్చి నీముందు కురురాజు ♦ మెచ్చుఁగొందు.

శల్యు:—(నవ్వుచు) ఇచ్చట నర్జునుఁడున్న నీవిట్టి బీరంబులఁ బల్కుటకు నైన మందహాసముఁ జేసియుండును. కురురాజును మెప్పించుటకు నిట్టి రిత్తపల్కులఁ బల్కవలయునా?

కర్ణు:—శల్యా! ఏమనుచుంటివి? రిత్తపల్కులనియా?

ఉ॥ చిందఱవందఱొంది కురు ♦ సేనలు బల్మిఁ దొఱంగుఁగాక, నా
స్యందనమస్థిరంబయి గ ♦ ఱావనిఁ గ్రుంకక యున్న; గెల్పుకున్
సందియమొంది కొందలము ♦ నన్ వడిఁ బాఱినఁ బాఱకున్న, సం
క్రందనుఁ డడ్డమైన, హరి ♦ కైదువుఁ బూనినఁ గ్రీడిఁ ద్రుంతు; నీ
క్రిందను సేవకుండయి చ ♦ రించును కర్ణుఁడు రిత్తఁ బల్కినన్.

(ఇంచుక రోసముతో) ఓయీ! పాండవులు నీకుఁ జుట్టములగు కారణంబుననో, నే సైన్యాధిపత్యము వహించితినను నోర్వలేమినో, నోరికివచ్చినట్టు లెగ్గులాడిన సరియా? వీరుని యందుగల నిక్కమగువిలువ నీవేమి గ్రహియింపఁగలవు.

ఉ॥ కార్యముదప్పి ముప్పయినఁ ♦ గర్ణుఁడు వీసమునైన సాహసౌ
దార్యములందొలంగఁడను ♦ ధైర్యముఁ జెంది నరుండుఁ గృష్ణుఁడున్
గాంభీర్యముఁబూని పోరితము ♦ నన్గల ధర్మముఁదప్పకున్న నే
శౌర్యము నీకుఁ జెల్లమగు ♦ చందము జూపెదఁ గ్రీడి బెగ్గిలన్.

క్షేమ:—(రహస్యముగ) శల్యా! నిర్భయంబుగ ననఁదగిన దంతయు ననుము. వెనుకంజనిడకుము.

శల్య:—కర్ణా! నోర నాలుకయుండఁ బలుకులకేమి భాగ్యము. రణముఖంబు నెన్నండుఁ జూడని ముదుసలియు నీ పలుకుల కన్న నెక్కుడుగఁ బలుకవచ్చును. ఖాండవారణ్యంబు దహింపఁజేయుతఱి నింద్రుఁడు, పోరాడఁజాలక పాశుపతాస్త్ర మొసంగి సంతోషింపించుకొనిన యీశ్వరుఁడిట్టిపలుకులు నీ పజ్జ నేర్చుకొనియున్న నరునిపీచ మడంచియుండును. ఇంతకు వారలు నీయట్టి వీరులా? కర్ణా! వీరంబుల కాద్యంతము లుండవలదా?

ఉ॥ ఎక్కడికయ్యమూర! నరుఁ ♦ డెక్కటికయ్యమునం జెలంగి పెం
పెక్కిన కేలుబోయి ధను ♦ వెక్కిడి యెక్కులునెట్టు వెన్నుపై
రెక్కలగండుమీఱి తన ♦ యెక్కువఁ జూపరు లెల్లమెచ్చ నీ
టెక్కులఁ జక్కఁజేయఁడొకో? ♦ డెబ్బదిడెబ్బలు బంటుబీరమే.

విందు:—భళిరా! మద్రభూవరా! బాగుగఁ బలికితివి.

దండ:—విని సంతసింపుము. ఎల్లరు నాక్షేపించుటకుం దగిన వారలే?

శకు:—సంతసించుట యెక్కడ. ఇవియంతయుఁ గుందుటకే.

దుశ్శా:—(దుర్యోధనునితో) అన్నయ్యా! ఒకరిం జూచియొక
మర్యాదల నతిక్రమింపుచున్నట్టులున్నది.

దుర్యో:—మద్రనాథా! కర్ణుండాధిపత్యము వహించుట నీక
ష్టమైన నగుంగాక. ఇట్టి నిరుత్సాహంపుఁబలుకులఁ బలుక
దగునా? వీరధర్మము నీ వెఱుంగనిది కాదుకదా?

శల్యు:—రాజా! ఏమనుచుంటివి? నిరుత్సాహంపుఁబలుకు
లనియా? ఉన్న నిజముఁ దెలిపిన నింత కోపమెందులకు?

చం॥ అలఁతులు గూల్ప నేర్తురె? మ ♦ హారణశూరులు పాండుపుత్రులే
పొలుపున వారిఁ జంపఁగల ♦ పోటరియా? నిజ మీ వెఱుంగవే?
పలుకులఁ బల్కినన్ సరియె? ♦ పార్థుఁ డొకండు దురంబు సేయఁగాఁ
జెలఁగిన వానితోడ సరి ♦ సేయునె? కర్ణుఁడు విక్రమంబునన్.

ఎదిరిబలిమిఁ దనబలిమి గ్రహించి పోరవలెఁగాని తగుప
నని ప్రతికార్యముఁ దలనిడుకొనినఁ గీడుగాక మేలగునా?

ఉ॥ రక్కసపల్కు లాడిన దు ♦ రంబున గెల్వ పసిండిచాన చేఁ
జిక్కునె? నీవు స్నేహితముఁ ♦ జెప్పిన పెద్దల నీరసించి లా
వెక్కిన బంటుమిన్నవలె ♦ నెచ్చిఱుక్రొవ్వున రేఁగినాఁడ వీ
బక్కను కర్ణునిన్ మది ధ్రు ♦ వంబని నమ్మితివే సుయోధనా?

కర్ణ:—మిత్రమా! శల్యుని నిరుత్సాహపుఁ బల్కులకు నే
భీతిలువాఁడఁగాను, నన్ను నీవెఱుంగవా? ఎఱింగియు
శల్యుని వాక్కుల గణింపనేల?

చం॥ నరములతోడఁ బైకుబుకు ♦ నంజుడుముద్దలఁ బొడ్చి వెచ్చ నె
త్తురులను ద్రాగు కాకములఁ ♦ దోలుచుఁ బీన్గుల మెక్కు నక్కలన్

దోరకొని గొట్టుఘాతముల ♦ తోఁబయి ఝుమ్మను మక్షికాళితో
వఱలుచునుండు పార్థునిశ ♦ వంబు ధ్రువంబుగ నీకుఁజూపెదన్.

శల్యు:—భళిరా! కర్ణా! నిన్ను మెచ్చవచ్చుఁగదా!

గీ॥ వాఁడిమింగల మొగజోదు ♦ వలెఁ జెలంగి
పేర్మిఁదగుఁగాక రేకెత్తు ♦ బీరమునను
అక్కఱకురాని బిరుదులు ♦ పెక్కులేల
దబ్బులకుఁ జెయ్యులకుఁజాల ♦ దవ్వుచూపె.

ఉ॥ చండశరప్రహారముల ♦ సాహసవృత్తిని లావుమీఱ బ్ర
హ్మాండము బ్రద్దలౌనటుల ♦ నాహవరంగమునందు నేపుమైఁ
బాండవమధ్యుఁగూల్తునని ♦ పల్కుచుఁ గేరెద వెక్కిరించి, సూ
తుండట రాజపుత్త్రుఁడట ♦ దుస్తర సంగరమంట చెల్లరే?

కర్ణా! బహుభాషలేల?

గీ॥ వాఁడిమనకరి, మన సరి ♦ నాఁడిమగలఁ
విలుకుమూర్చిన మిడిమాసి ♦ పలుకునటులఁ
గాడునేయంగ దొడరు వి ♦ ల్కాఁడు కిరీడి
తోడ నీవేషపోరాడు ♦ టేమి; కల్ల.

దండ:—(శల్యునిఁజూచి) మద్రభూవరా!

ఉ॥ ఎచ్చట నేర్చినావొ? గురు ♦ వెవ్వఁడొ? నేర్పరివౌదు; నిన్ను నే
మెచ్చితి: నీదు పల్కులకుఁ ♦ మీఁదు వచింపగ నెవ్వఁడోపుఁ గా
ర్చిచ్చువిధంబు శౌర్యమను ♦ వృక్షముఁగాల్పఁగఁజాలు పల్కు లీ
వచ్చునఁ బల్కు నీకుఁగల ♦ మచ్చర మెట్టిదొ? రాచమచ్చరీ!

కర్ణు:—దండధార! శల్యుఁడు కురురాజు పైఁగల యభిమానము చే హితోక్తులఁ బలుకుటకు మనము సంతసింపఁదగినదే! (శల్యునిఁజూచి) మద్రనాథా! నీవనినట్లు లర్జునుండు సింహపరాక్రముండనుటకు సందియము లేదు. సూతకుల సంజాతుండనగు నేను వానితోఁ బోరఁదగదు. అందుచే క్షత్రకులాభరణుండవగు నీవు సైన్యాధిపత్యము వహించి పోరుము. అందుల కెంతమాత్రము నా యభ్యంతరము లేదు. రాజునహిత మిందుల కంగీకరించును. ఎవరైననేమి? రాజభక్తిఁగలిగి పోరినంజాలును.

శల్యు:—నీవుండ సైన్యాధిపత్యము నా కేల?

కర్ణు:—బాగుగఁజెప్పుచుంటివి. పోరవలదని నన్ను వారింపుచుంటివి. సైన్యాధిపత్యము నేను వహింపనని యంటివి. నీ యభిప్రాయ మేమి? కురురాజు నిప్పట్టున విపదంబుధిలోఁ బడఁద్రోయుమనియాయేమి?

శల్యు:—నా యభిప్రాయ మయ్యది కాదు. జయము మనకుఁ జేకూరదుగావున యుద్ధము వలదని.

కర్ణు:—జయాపజయంబులు నీ వెట్లు నిర్ణయింపఁగలవు. యుద్ధము వలదని పలుకుట పందల లక్షణము.

చం॥ గిలిగొని మంచిఁజెట్టఁ బరి ♦ కింపక కింకిరిపాటుతోడ నీ
పలుకులఁబల్క నోరెటుల ♦ వచ్చెనొ? దాయకుఁజంకి నెమ్మదిన్
గలతనుజెంది యిక్కరణిఁ ♦ గారులఁ బ్రేలుచునుంటివీవు రా
కొలమునఁ బుట్టగాఁడగునె ♦ కోఁచవుగాక రాచవిన్నవే?

క్షేమ:—(తనలో) ఇప్పటికి శల్యునినోరు కట్టుపడును.

దుశ్శా:—శల్యా! పలుకుటకు నాలుకయాడకున్న దాయేమి.

శకు:—మొద్దుపోయెంగాబోలు.

వృష:—ఐయుండవచ్చును. వాలుసహిత మెపుడైన మొద్దు పోవును. అట్టితతినాలుకయన నెంత.

విందు:—కురురాజా! ఇప్పటికేఁజాలకాల మతిక్రమించినట్లున్నది.

దుర్యో:—ఔను, బాగుగ జ్ఞాపకముఁజేసితివి. అర్జున ప్రతాపాగ్నిచే స్రుక్కియున్న కురువాహిని ఘనుఁడగు కర్ణునిచే వీర రసముంజెంది యర్జునమూలంబుఛేదించి పొంగి పొరలుంగాక. కురువీరు లెల్లరు యుద్ధమునకు సిద్ధముగ నుండుడు. దుశ్శాసనా! అంగరాజు సైన్యాధిపత్యము వహించెనని ప్రకటింపఁ జేయుము. మిత్రమా! అంగరాజా! మన మిఁక పోవుదము.

(కర్ణదుర్యోధనులు నిష్క్రమించినపిమ్మట మెల్లగ నెల్లరు నిష్క్రమింతురు).

---



ప్రథమాంకము సంపూర్ణము.



శ్రీ

# విజయవిజయము.

## ద్వితీయాంకము.

—:o:—

స్థలము:—కురుక్షేత్రప్రాంతము.

---

ప్రవేశము—హరిహరశర్మ, నారాయణభట్టు.

---

నారా:—ఏమండోయి! శర్మగారూ! యుద్ధంసంగతు లేలాగున్నాయి.

హరి:—బాగానేవున్నాయి. మన కౌరవులు చాలామట్టుకు సాహసించి యుద్ధం చేస్తున్నారు. మూడు వంతులు మనకే జయం వుండవచ్చును.

నారా:—నేను చారుణ్ణి అనుకొన్నారా యేమిటి? రాజకీయోద్యోగస్థులు కాబట్టి మిమ్మల్నడిగేను. నాదగ్గర మరి కపటం వుంచకండి. నిజమేమో శెలవియ్యండి.

హరి:—నిజం శెలవియ్యడానికి...యేముంది. యుద్ధం చాలా తీవ్రంగానేవుంది.

నారా:—యుద్ధం తీవ్రంగావుందీ అన్నసంగతి నాకూ తెలుసును అయితే సంగతీసందర్భాలు మనవాళ్లకి లాభంగాఉన్నా

హరి:—మనవాళ్లని అంటున్నారు. మనవాళ్లెవరో మొదట మీరు తెలవియ్యండి.

నారా:—మనవాళ్లంటె మరెవరు. మఱివచ్చీ—కౌరవులేకదూ?

హరి:—నిశ్చయంగా మీరు మనవాళ్లంటె కౌరవులనే అభిప్రాయంతోనే ఉన్నారూ? చూసేరా, మీరు కపటంగానే మాట్లాడితే నేనూ కపటంగానే మాట్లాడుతాను.

నారా:—పైకి కౌరవులేఅని చెప్పాలి.

హరి:—లోపట యెవరనిచెప్పాలి?

నారా:—హాం......అయ్యా! మీరెవరో నాకు తెలియదు. అన్నీ నానోటివెంటపలికించి గొంతుగ కోస్తారేమో అని భయంగాఉంది.

హరి:—నేనూ మీవంటివాణ్ణే. పాండవులమీదభిమానము మీకొక్కరికేకాదు. నాకూఉంది. లోకులకందరికీవుంది.

నారా:—అయ్యా! శర్మగారూ! లోకులకందరికీ పాండవులమీదే అభిమానంవుంటే దుర్యోధనుఁడిన్నాళ్లు రాజ్యం ఏలగా గే లేదు?

హరి:—మెల్లిగామాట్లాడండి. రాజభటు లెవ్వరైనా వినగలరు. పాండవులమీదందరికీ అభిమానంవున్నా, ఇన్నాళ్లు దుర్యోధనుఁడు రాజ్యంఏలడానికి కారణం కర్ణుడే.

నారా:—అదేలాగు.

హరి:—అవునుగదా? ఆకొడుకుల్లో జ్యేష్ఠుడితడు. ధర్మరాజు కాబట్టి రాజ్యంతా ధర్మరాజుదే అవుతుంది,

నారా:—ఆఁ ఆఁ ఏమంటావూ?

హరి:—ఇదిఆలోచించే ధృతరాష్ట్రుడు చమత్కారం చేసేడు. పాండు ధృతరాష్ట్రులిద్దరూ పనికిరారని ప్రజలిదివరకే కొట్టిపారేశేరు. కాబట్టి వాళ్ళకొడుకుల్లో పెద్దవాడికే రాజ్యం అంతా రావలసిఉంటుందనీ, ఇదివరకున్న అభిమానానికితోడీమాటకూడా తోసి ప్రజలు తిరగబడతారేమో మొదటికే మోసంవస్తుందేమో అనిఊహించి, ప్రతినిధై పాండురాజు కొత్తగా సంపాదించినభాగం ఆధర్మరాజు కిచ్చేసేడు. పైతృకంఅంతా దుర్యోధనుడికిచ్చేసేడు.

నారా:—సరే. అటుపైని జరిగినదంతా అందరికి తెలిసిందే. కాని నాకొక్కసందేహం తమరుతీర్చాలి. అన్నీచాలించికూర్చున్న భీష్మునివంటివాణ్ణి దుర్యోధనుడు యుద్ధానికి లాగేడుగదా. విదురణ్ణెందుకు విడిచిపెట్టేడని.

హరి:—విదురుడు దూరాలోచనగల మంత్రవేత్త. ఎలాగూ యుద్ధం జరుగుతుంది అందులో కృష్ణసహాయం ఉన్న పాండవులు గెలవకపోరు కౌరవులు నాశనం కాకమానరు మధ్య మంత్రసానిగండం నాకేలా అనిఊరుకొని ఉంటాడు. అంచేతనే యుద్ధంమంచిదికాదు వద్దువద్దూఅని ఎన్నివిధాలో్న శతపోరేడు. అయితే దుష్టచతుష్టయం లక్ష్యంచేసిందికాదు. వెం

కృష్ణుడుకూడా ఇదేసమయంరాఅని విదురుడికి పురెక్కించి వచ్చేడు.

నారా:—ఏమో. ఎప్పుడేబుద్ధిపుట్టునో. బుద్ధితిరిగి విదురుడు విల్లు పట్టుకోకూడదూ.

హరి:—ఎందుకుకూడదూ. విదురుడు విల్లు పట్టుకోవచ్చును. కృష్ణుడూ చక్రంపట్టుకోవచ్చును.

నారా:—ఊఁ ఏమిటో. రాజ్యం వీరభోజ్యంఅన్నట్టు యుద్ధం ప్రళయంగాఉంది. ఈగొడబలో ద్రోణుడు డిక్కీకొట్టేసేడే మరీ—

హరి:—ఉండవయ్యా ఏం వెఱ్ఱిమాటలు. ఏనుగుకి సింహస్వప్నంలాగు పాండవుల పక్కబల్లెం కర్ణుడు జండా ఎత్తలేదటయ్యా.

నారా:—అయితే పాండవులు కొంచెం భయపడవలసినదే?

హరి:—కొంచమా. భీష్ముడుద్రోణుడుకాదు కర్ణుడు. కౌరవులికి పాండవులికి జయమో అపజయమో కర్ణుడులో ఉంది.

(తెరలో కలకలమగును.)

నారా:—(భయముతో) ఏమ్టాండీ ఆధ్వని.

హరి:—రాజభటులు వస్తున్నారోఏమ్టో. ఇక్కడ మనం మాట్లాడడం నష్టమే. కాళ్లకి బుద్ధిచెప్పండి.

నారా:—నా అభ్యంతరంలేదు.

(అని యిరువురు పరుగిడుదురు.)

స్థలము ౨.—కురుక్షేత్రము.

(బలిమిని దృష్టద్యుమ్నునిఁ బట్టుకొని కృపాచార్యుడు ప్రవేశించును.)

---

కృపా:—ఓరీ! పాంచాలుఁడా! చండాలుఁడా! నిన్నుఁ దాకినం లకు నీ రక్తమున స్నానమాచరింపవలసియుండునుగాని

గీ॥ పరశురామునిఁబోలి కుం ♦ భజనిసుతుఁడు
నిన్ను వధియింపనూహించె ♦ నిశ్చయంబు
అక్కతంబున నేను నీ ♦ యుక్కడంప
నగునె? ధర్మంబె? యొకనిభో ♦ జ్యమప్పనివు.

ఓరీ! బ్రాహ్మణద్వేషి! నేఁడు నీవు నాతోఁ నేల యుద్ధమ జేసితివి? నాచే నేలచిక్కితివి? పిఱికిపందవగు నీతోఁ యుద్ధమ జేయుట దుర్బలయగు సబలతోఁ బోరుటయే. రమణితో బోరాడి యోడి వెన్నిచ్చిన రాచబంటు గలఁడని యూహిం పచ్చు గాని, మూర్ఛావస్థనున్న వృద్ధబ్రాహ్మణుని కంఠమ దునిమిన చండాలుని నిన్నుఁదక్క యింకొకని యూహిం వచ్చునా? మూర్ఖుఁడా! ఏముఖమున నాకెంటఁబడితివి?

చం॥ పడుచుఁదనంపుఁ బెంపునను ♦ పాడియెఱుంగక పోతరించి యి
ప్పుడు గడిమీఁటి యొక్కటినిఁ ♦ బోరగ వచ్చుటెగాక యేప్రహాఁ
దొడిగితి వొక్క బాణమును ♦ తూణము సందుసనుండి దీసి, నె
వ్వడిఁగలవాఁడ నైనఁ జెడి ♦ పాఱుకుమీ, నిను మోహరించెనన్.

దృష్ట:—ఓహో! ఏమిపాండిత్యము. పోరాడి యోడినవారలు లేరా? మోహరించెదనని నీ వనినంత భీతిలెదవేమి? ఇంత టికే గర్వమా?

కృపా:—ఛీ! పాపాత్మ! మాటలాడుటకు నీనోర నాలుక యున్నదా? సిగ్గైన లేకపోయెనా? నీ బ్రతుకునకు యుద్ధ మొకటియా?

చ॥ పరుగిడి పొమ్ము జెండువడి ♦ పౌరుషముండిన లాభమున్నె? భూ
సురునకు నీవు చాలుదువె? ♦ యోధులు మెండుగఁ గూలిరా కళే
బరములఁ ద్రుంచి తృప్తిఁగన ♦ వచ్చును ప్రాణములున్నఁ జోరిన
న్మరణము సంభవించు; నఖి ♦ మానముతోఁ బనియేమి భీరువా.

(తెరలో) ఓ కౌరవయోధవరులారా!

గీ॥ కర్ణుడే నకులుంపు సం ♦ గరమునందు
పరిభవింపఁబడెనని సు ♦ వ్యక్తశక్తిఁ
దెలుప జనరాజువసుమతి ♦ పాలునకర
శీఘ్రముగఁ బొందుపొందింక ♦ శిబిరములకు.

దృష్ట:—(తనలో) ఓహో! నావలె నకులుంపు నోడెనా?

కృపా:—ఓరీ! పాంచాలా! మా సైన్యాధిపతి వచ్చుచున్న ట్లున్నది. మర్యాదఁగలిగి ప్రవర్తింపవలయును. లేనిచో నీ ప్రాణములు దక్కవు.

(అనంతరము పూర్వసైన్యముఁ జనువుముఁ గర్ణుఁడును ప్రవేశింతురు.)

కృపా:—సైన్యాధిపత్యము వహించిన యంగభూపాలునకు జయంబగుఁగాక.

కర్ణు:—ఆచార్యవర్యా! నమస్కారము. (దృష్టద్యుమ్నుఁ జూచి యాచార్యునితో) మహాత్మా! పాండవసేనాధిపతివలె నున్న యీతఁడు దృష్టద్యుమ్నుఁడాయేమి? ఈ పుణ్యపురుషుండు మీ కెట్లు జిక్కినాడు?

దృష్ట:—(తనలో) అనలమునకనిలముతోడైనవిధమున నాచార్యునకుఁ గర్ణుఁడు తోడయ్యెనే! నాబ్రదు కేమగునో!

కృపా:—నేఁడీ పాంచాలపశువు నాతోఁ బోరాడి యోడి నాచేఁ జిక్కెను. సైన్యాధిపత్యము వహించిన నీకుఁ దగిన యుపాయనముగ వీని నీకొసంగ నిశ్చయించితిని. కౌరవసేనాధిపా! నీ యాజ్ఞ యెట్టిదైనఁ గావించుటకు సిద్ధముగనున్నాను. అయ్యది నావిధిగదా?

గీ॥ యుద్ధమున సేన బోదునై ♦ యుండు దనుక
యధిపతివి నీవు నీయాజ్ఞ ♦ నరయవలయుఁ
గారనుంతువో? త్రుంతువో? ♦ కరుణఁగలిగి
కాచెదో? సర్వసేనాధి ♦ కారివీవు.

దృష్ట:—(తనలో) అహాహా! కర్ణమృత్యువునకుఁ జిక్కితినే? చిక్కినంజిక్కితింగాని కర్ణుఁ డుదారస్వభావముగలవాఁడని బహుభంగులఁ బలుకుచున్న లోకమునందలి సత్యము నే

కర్ణ:—ద్రౌపదీసహోదరా! పాండవసేనాధిపా! (మృదుకంఠముతో) నీవు ఖిన్నుండవై యిట్లు చింతింపనేల? నాచేఁజిక్కినందులకు నీ కపాయమేమియు లేదు.

చం॥ అని బొనరింపఁబోలును, జ ♦ యాపజయంబుల నిర్ణయింప నె
వ్వనికయినన్ దరంబె? యొక ♦ పట్టునఁగీడుఘటిల్లుఁగాక; య
ర్జునుఁని భవత్సహోదరిని ♦ జుట్టములన్ గలరాచజోదులన్
గనుఁగొనఁబొమ్మి నేఁడొసఁగె ♦ గర్ణుఁడు నీకభయప్రదానముల్.

(విచారమునఁ దలవంచుకొని ధృష్టద్యుమ్నుఁడు నిష్క్రమించును)

కృపా:—అంగరాజా! నేటి నీయుద్ధక్రమము జయప్రదముగ నున్నది. సైనికులెల్లరు నమితోత్సాహముఁగలిగియున్నారు.

గీ॥ కురుచమూవృక్ష సందోహ ♦ మరికుఠార
ధారలఁ బ్రోడులై భవ ♦ ద్దర్శనమను
నవవసంతాగమంబునన్ ♦ గడిమిఁ జెంది
పౌరుషోత్సాహ భరితమై ♦ పల్లవించె.

కర్ణ:—ఆర్యా! భవత్కృపావలోకనంబునఁ గృతార్థుఁడ నైతి.

కృపా:—(తనలో) నిత్యకర్మకు వేళయైనట్టులున్నది. (ప్రకాశముగ) కర్ణా! పశ్చిమదిశం దిలకింపుము.

గీ॥ బ్రాహ్మణులు మ్రొక్కు సమయంబు ♦ పక్షివితతి
నలుదెసలఁ బాఱి యెలుఁగులం ♦ దెలుపుచుండె
నీదు కోప ప్రతాపసం ♦ దీప్తవదన
మండలముఁ బో-

కర్ణ:— అవునవును. మీకు వేళ యైనది.

కృపా:— నా కాజ్ఞ యొసంగుము.

(అని కృపాచార్యుండు నిష్క్రమించును.)

కర్ణ:— మజ్జనకుండగు సూర్యభగవానుండు నాదెస నరుణ దృష్టిం జూచుచున్నట్టులున్నదే? తండ్రీ! సూర్యనారాయణా!

మ॥ ననుం గోపింపకు నీదు కుండలములన్ ♦ వస్త్రంబు నింద్రుండు వే
కొనెనంచున్; భవదీయ పుత్రునిగనుల్ ♦ కొండాడగన్ గ్రీడిన
ల్లనుజల్లాడెద; పాండురాజసుతులా ♦ లాపించుటల్ విందు; నీ
కనయంబున్ రిపుకంఠరక్తమునన ♦ ర్ఘ్యంబిచ్చి పూజించెదన్.

(అని నమస్కరించి) నన్నుం గన్నతల్లియైన కుంతికి నాఁ డొసంగిన వరముప్రకారము భీమనకులసహదేవులం జంపక విడుదలఁ జేసితి. ఇఁక ధర్మరాజుఁబట్టి విడుచుటయు నర్జునునిం జంపుటయు నున్నది. నాకుఁ దగిన సారథి లేకపోవుటచే నెంతయు గొఱంత వాటిల్లినది. కురువీరులలోఁ గృష్ణునకు సరిసేయందగినవాఁ డెవ్వండో వితర్కింపవలసియున్నది. (ఇంచుక యాలోచించి) శల్యుండంతటివాఁడని యూహించెదను. అతఁడు సారథిగనుండ నంగీకరించునా? అట్లయినఁ గర్తవ్యమేమి? కురురాజుచే వాని నొప్పింపవలయు. (ఎడమకన్నదురును) ఏమేమి? త్రిలోకభీకర ప్రభాకరపుత్త్రుండగు కర్ణునకు సహితము హానియుండునా? ఇట్టి స్వల్పములకుఁ గర్ణుండు భీతిలెడువాఁడుగాఁడు.

ఉ॥ సంగర రంగమందు సహ ♦ జన్ముని దేహముపైని సర్వభూ
తాంగ విహంగ సంఘము వి ♦ హారము సేయగఁ గాంచి సోదరా
యంగవిభుండు సేసెనిటు ♦ లంచును ధర్మజుఁ డుందఁ జేతును
ప్పొంగుచు నంతరంగమున ♦ భూపతి మిక్కిలి సంతసిల్లగన్.

వేగమ దుర్యోధనునితో నీవిషయము ముచ్చటించి యనంతరము నా శిబిరంబున కేగెదంగాక. (అని నిష్క్రమించును.)

---

స్థలము ౩.—దుర్యోధనుని శిబిరము.

---

దుర్యో:—(ఆలోచనానిమగ్నుఁడై) కర్ణుఁడు గోరినకోరిక దుర్లభముగనున్నది. అందులకు శల్యుఁ డంగీకరించునా! ఎట్లయిన శల్యు నొడంబరుపవలయునని కర్ణుఁడు గ్రుచ్చి గ్రుచ్చి చెప్పెను. కృష్ణునితో శల్యుఁడు సారథ్యమున సమానుఁడనుటకు సందియంబులేదు. ఈ విషయము శల్యునితో సంభాషించి సాధ్యమగునంతదనుకఁ బ్రయత్నించెదంగాక. పర్యవసాన మెట్లుండునో?

ప్రతిహారి:—(ప్రవేశించి) జయముజయము మహారాజా! కృపాచార్యుఁడు నశ్వత్థామయు......

దుర్యో:—సరియే. వారు రావచ్చును.

(ప్రతిహారి నిష్క్రమించును.)

దుర్యో:—రాత్రివేళ వీరు వచ్చుటంజూడ నెయ్యదియో విశేష ముండవలయు. ఏమైయుండును?...

(అశ్వత్థామ కృపాచార్యులు ప్రవేశించి యాసీనులగుదురు).

కృపా:—రాజా! నీ యాలోచనకు భంగముఁ గావించినవార మైతిమి.

దుర్యో:—భంగమున కేమున్నది. ఆలోచన కేమున్నది.

అశ్వ:—రాజా! నారాక నీవు గ్రహించియేయుందువు.

గీ॥ లోకబాంధవుఁ డస్తాబ్ధి ♦ లోనడంగ
నంధకారంబు వ్యాపించు ♦ నట్లు నాదు
జనకుఁడీల్గిన కతన వి ♦ చార మొండు
హృదయ సీమనువ్యాపించె ♦ నెఱుఁగుదీవు.

దుర్యో:—(విచారముతో) అయ్యది లోకవిదితము. ఆ విచారము తొలంగవలెనన్న వైరులం దునుమాడుటయె.

కృపా:—అందులకు సందియమేమి!

అశ్వ:—రాజా! విచారము తొలంగవలెనన్న వైరులం దును మాడుటయని నీవు వచింపవలెనా? అయ్యది నే నెఱుంగనా? యుద్ధము మాకు హస్తబదరీభూతంబని యెవ రెఱుంగనిది ఇపుడీవిషయము నీతో ముచ్చటించుటంగల మదభిప్రా యము నీవు గ్రహించియుందువని తలంచితి.

మ॥ జలముక్కాండవిముక్త వజ్రసదృశా ♦ త్రస్ఫారధారాహతిన్
గలఁగుండై పులిఁజూచు జింకగుమివాఁ ♦ ...

పలుకుల్ కల్లలుగావు చూవె కురుభూ ♦ పాలా! భవద్దత్తవై
తుల దారా నయనాంబుధారలను మ ♦ త్క్రోధాగ్నిఁ జల్లార్చెదన్.

కృపా:—రాజునకుఁ గావలసినదేమి?

దుర్యో:—అంతటికన్న సంతసం బొందుండునా?

అశ్వ:—అట్లయిన సైన్యాధిపత్యము నా కొసంగుము.

దుర్యో:—సైన్యాధిపత్య మెందులకు? లేకున్న యుద్ధముఁ జేయ దగదా?

అశ్వ:—సూతుఁడొకండాధిపత్యము వహించియుండ వానిక్రింద బంటనై యుద్ధముఁ జేయుదునా?

దుర్యో:—సూతసుతుండైన నేమి? ఎవ్వరైన నేమి? రాజభక్తిఁ గలిగియుండవలెఁగాక.

అశ్వ:—అతని పలుకలంబట్టి కర్ణుఁడు రాజభక్తిఁ గలవాఁడని యెంచితివా?

గీ॥ యామినీచరభయము నుం ♦ తైన లేని
అనిమిషత్వంబు వహియించి ♦ యధిపుఁ బోల్చి
అమరులన్ ధిక్కరించెద ♦ నంచుఁ గుక్క
పలుకుఁగాక నైజగుణంబుఁ ♦ బాయఁగలదె.

కృపా:—(తనలో) ఓహో! అశ్వత్థామకుఁ గోపము మితి మీఱుచున్నదే?

దుర్యో:—ద్రోణనందనా! బ్రాహ్మణులపై మాకు విశ్వాసము నశించినది. అక్కతంబున సైన్యాధిపత్యము కర్ణున కొసంగఁబడినది.

చరమత ధర్మతత్పరుఁడు ♦ శౌర్యము ధైర్యము బాహువీర్యమున్
దొఱఁగని రాచజోదు, తుల ♦ తూఁగునె యెట్టిఁడునంగరాజుతోన్.

బలగము కొలందిదైనను నేటి కర్ణునియుద్ధక్రమము జయప్రదముగనున్నది. అమితసైన్యము జయంబున కొండు ముఖ్యకారణము కాదుగదా.

చం॥ బలగము లెక్కకున్ మిగులు ♦ బారులఁదీర్చిన లాభమున్నె? వై
రుల రణధర్మ మర్మములె ♦ ఱుంగు చమూపతి శక్తి, యుక్తి, కా
వలయును గాక; నాకకడు ♦ బల్మిఁగలట్టిదయైన నావికుం
డల సతఁజెంది యేమఱిన ♦ నంబుధిఁ గ్రుంకకయున్నె ప్రేల్మిడిన్.

ప్రతిహారి:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా! మద్రదేశ మహారాజు ... ...

దుర్యో:—సరియే వేగమె ప్రవేశింపఁజేయుము.

ప్రతిహారి:—చిత్తము. మహాప్రసాదము (నిష్క్రమించును).

దుర్యో:—కర్ణుఁడు కోరినకోరిక నెఱవేరునా? శల్యుఁడందులకు సమ్మతించునా? సమ్మతింపనిచోఁ జేయునదియేమి? ఊఁ, ఈ విచారములతోఁ బనియేమి?

చం॥ ఘనమను భ్రాంతిఁ గొల్పపటు ♦ గర్జనసేయుచు శ్వేతకాంతులన్
దనరుశరత్పయోధరము ♦ దంభముఁగాంచి నిరాశఁ జెంది తృ
ష్ణను దురపిల్లుచాతకము ♦ చందము నాదు మనోరథంబు శ
ల్యుని యెడరిత్తవోవు విజ ♦ యోదయయోగము లేకయుండినన్.

శల్యు:—(ప్రవేశించి) కురురాజునకు జయంబగుఁగాక.

దుర్యో:—(లేచి శల్యుని కరముఁబూని) మద్రభూవరా! ఈ యాసన మలంకరించెదవుగాక. (అని యథాస్థానోపవిష్టుఁ డగును.)

శల్యు:—(ఆసనోపవిష్టుఁడై) రాజా! నన్నుఁబిలిపించిన కార్య మేమి?

దుర్యో:—(ఇంచుక యాలోచించి) కార్యార్థినై నిన్నుఁ బిలిపించితిఁగాని మనోరథసిద్ధి కానేరదనుతలంపున మనంబు తత్తరిల్లుచున్నది.

చం॥ జనవర నీవు చంద్రకుల ♦ సంజనితుండవు; చంద్రవంశసం
జనితుఁడ నేను; నట్టియెడ ♦ స్వల్పము నీయెడఁ గోరవచ్చునే
అనఘ నెడన్ మనోరథము ♦ వ్యర్థమయైనను చాలలెస్స; య
ల్పునియెడఁ గోరు కోరిక య ♦ మోఘమయైనను నద్దివ్యర్థమౌ.

అందుచే నీవు నిరాకరించినను లెస్సయే. ఒక కార్యభారము నీపైనిడఁ దలంచితిని.

శల్యు:—ఆకార్యభారము క్షత్రియోచితమైన భరింపుటకు నా కభ్యంతర ముండదు. తగునో తగదో నీవ విచారింపుము.

దుర్యో:—మద్రభూవరా! మనుజునకుఁ దగినపనులనియుఁ దగని పనులనియుఁ గలవా? నీకు నాపై దయయున్నచో నా కోరికయీడేర్పుము. లేనిచో నీయిష్టము మాదురదృష్టము.

శల్యు:—స్వల్పకార్యము ననుఁ గోరఁదగదని పలికితిని.

దుర్యో:—ఏకార్యము స్వల్ప మనంబడునని నీ యభిప్రాయము?

గీ॥ కసిడి కర్జంబు ఘనునిచే ♦ ఘనతఁ జెందు
గొప్పకార్యంబు స్వల్పుచేఁ ♦ గొలఁదియగును

ప్రకాశ నైర్మల్యంబు లూహించి ♦ వస్తుగుణముఁ
బ్రాప్త పాత్రయోగ్యతఁ బట్టి ♦ నచ్చుఁ జూడ.

సీ॥ పంకగతమైన జలకణం ♦ బింకుఁ; బద్మ
పత్రగతమైన మౌక్తిక ♦ భంగి నొప్పు
శుక్తిగతమైన నయ్యది ♦ మౌక్తికంబు
పాత్రయోగ్యత నేదని ♦ బ్రతిఫలించు.

శల్యు:—సరియే. నీ యభిప్రాయముఁ దెలియఁజేయుము.

దుర్యో:—నీవు సారథ్యము వహింపవలయు.

శల్యు:—కర్ణునకుఁగాదుకదా?

దుర్యో:—కర్ణునకైననేమి?

శల్యు:—మరేమియు లేదు. సూతసంభవుండని.

దుర్యో:—ప్రథమనైచ్యంబులు జన్మమునఁ బట్టియుండుననియ నీయభిప్రాయము. భూవరా! సర్వోత్కృష్టమైన నీ విట్లు పలుకవచ్చునా?

గీ॥ వసుధ నొకశుక్తి గర్భసం ♦ భవుఁడగు చైన
నేమి యాయమను గుణములు ♦ హీనములగునె?
భూరుహాము భూరుహాంశైన ♦ పుష్పములను
ఫలముల నొసంగువిను మింక ♦ సలఁతి యగునె?.

కృష్ణునకు సరియైన సారథి నీవుగాక గుణనైర్మల్యంబున ని కొకండు లేడనికి నీశ్రమ నీ కొసంగ పిలువవచ్చితిని. నీకు నాపై దయయున్నచో

గీ॥ నలువతిగ్రోలు రక్కసి ♦ తులువలీల్ల
దోలుఁదాలుపు గుఱ్ఱాలఁ ♦ దోలునటుల
గర్ణసారథివై నేడు ♦ కరుణఁజిహ్వ
పాముగాకుండ మమ్ముఁగా ♦ పాడుమీవు.

శల్యు:—(తనలో) అంగీకరించుటకు మనం బొప్పకున్నయది. పాండవజయోదయంబునకైన నంగీకరించవలెగాక. (ప్రకాశముగా) కురుభూపాలా! నీ వింత నొక్కి చెప్పవలెనా?

గీ॥ కోరియే తెంచి నీయందుఁ ♦ జేరియుంటి
మున్ను నీయానకెందుఁగే ♦ లొగ్గువాఁడఁ
పార్థసారథి కృష్ణుండు ♦ పార్థివేంద్ర
కర్ణసారథి శల్యుండు ♦ కలవుదీర.

గీ॥ పార్థుఁడా లేక కర్ణుఁడా ♦ హాలుమగఁడు?
శల్యుఁడా లేక కృష్ణుఁడా ♦ కర్తసమఁడు
తెలియు శక్యంబుగాని సం ♦ దేహమిద్ది
చెప్ప నేటికి నీవ చూ ♦ చెదవుగాక

దుర్యో:—శల్యా! ఇప్పటికిఁ గృతార్థుఁడనైతి. చాల సంతసించితి.

శల్యు:—రాజా! చాలరాత్రియైనట్లు లున్నది.

దుర్యో:—అవును. మన మిప్పటికి విశ్రమించి ప్రాతఃకాలమున గాంచనఁ గలయుదము.

(అని యందఱు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సంపూర్ణము.



# విజయవిజయము.

## తృతీయాంకము.

---

స్థలము.—కర్ణుని శిబిరము.

---

కర్ణు:—(నిద్దురనుండి లేచి కనుల నులుపుకొనుచు) ఇపు డెంత వేళ యైయుండును? (అని నలుదిక్కులఁ బరికించి) అహో! పశ్చిమదిశ నా సందియంబును నివారింపుచున్నది.

మ॥ హరిభీతిన్ గకుబంతభూమిఁ గలవాఁ ♦ డైయుండగా నంధకా
సురుఁడా పాదితబాధలంగలుగు త ♦ చ్చారుల్ వలెన్ బక్షులున్
బొరిఁబర్వెత్తెపడిక్క; బతాకజలదం ♦ బుల్ హారవత్తారలుక్క
విరిసెన్; ఛత్రవదబ్జుఁడంబరరణో ♦ ర్వీన్ లంబబింబుండయెన్.

ఔరా! లోకంబున స్థిరమగునది యొండు లేదుగదా? చంద్రునిఁగనఁ గొండొక మనుజుండు జ్ఞప్తికివచ్చును.

చం॥ ఘనుఁడనటంచుఁ గ్రొవ్వి యధి ♦ కారమదంబున బంధుమిత్రులన్
గననిజనుండొకప్పు డధి ♦ కారపదచ్యుతుఁడై చరించు తీ
రును ప్రకటింపుచున్ హిమక ♦ రుండదె పశ్చిమభూమిభృత్తటం
బునఁ దిరుగాడుచుండె; నతి ♦ మూర్ఖుల దుస్థితి యిట్టిదోఁగదా.

ఓయీ! కౌరవవంశకరా! శీతకరా! నీకు సూర్యభగవానునకుఁ జాల వ్యత్యాసముగలదు. అమృతకరుండనని నీవు గర్వింపదగదు. అయ్యది వృథాభిమానము.

౦.॥ ఉదయంబున నెట్లుండునో
తుదియందును నట్లయుండుఁ ♦ దోయజసఖుఁడీ
వుదయించిన చందము నీ
తుదియందునఁగానరాదు ♦ తోయజవైరీ.

అమృతకరాఖ్య నీకుఁదగ ♦ దంచు వచింతు నినుండు ధారనీ
యము బహుధాగ్రహించి మధు ♦ రంబగు నీరమొసంగు నందుచే
పమదముఁజెంది మిత్రుఁడని ♦ బాంధవుఁడంచిరసంజలుల్ నమో
యమ్మని మ్రొక్కుచుందురు జ ♦ నంబులు; నీకు నమస్కరింతురే.

(ప్రాగ్దిశ దిలకించి) అహో! వేగుఁజుక్కయుఁ జంద్రునిఁగాంచి
వ్వుచున్నట్లు వెలుంగుచున్నది. అగునగు. (అని యించుక
లోచించునట్లు నటించి)

ఒక తటితేమిఁజెందిమతి ♦ యొండుతటిన్ ఘనుఁడైనవాని పో
క నధికారగర్వమున ♦ లీలగఁ గేరితి వాప్తవర్గముల్
కలమణంగె వైభవము ♦ శాశ్వతమేయని ధిక్కరింపుచున్
క వికనవ్వుచుండెనన ♦ వేగుఁజుక్క వెలుంగుఁ బ్రాగ్దిశన్.

ఓ వేగుఁజుక్క! నీయందు లోకనైజ మించుక కాన్పింపు
డి. ఎట్లను సందియంబు నీకు వలదు. ఎందుచేననన,

కలిమిఁదొలంగి లేవడినిఁ ♦ గాసిలెనంచు విలాసవైఖరిన్
లఁగలట్టి శీతకరుఁ ♦ గాంచి హసించెదు వేఁగుఁజుక్కయ
లినవిభుండు ప్రాక్తటము ♦ నన్ వెలుఁగొందిన నీదుకళ్కియున్
లవెలబాఱునన్నె? యవి ♦ వేకము లోకము నైజమిట్టిదే.

క్రమముగ నాకసము నూతనవిలాసముఁ జెందుకాల

ముప్రాప్తింపుచున్నది. అహాహా! కన్నులుగల భా[illegible]
ప్రాతరారంభవేళ మేల్కొనువారలకుఁ దక్క తది[illegible]
సమూఁగాంచు భాగ్యమెట్లులభించును.

గీ॥ పలుతెఱంగులరంగులం ◆ బరిఢవిల్లి
అరుణలేశంబులం గ్రాలి ◆ యరుణతురగ
మస్తకన్యస్తశోణ చా ◆ మర మనంగ
సంజకెంజాయ ప్రాచిను ◆ జ్వలితమయ్యె.

యుద్ధంబుచే నలసిసొలసి గాఢనిద్రావస్థనున్న [illegible]దన సహస్రకరంబుల మేల్కొలుపుటకు బాలభాస్క[illegible]యించుకాల మాసన్నమగుచున్నది.

మ॥ సురమార్గాటవినాసరాతపమునన్ ◆ శుష్కించి కాలంబునన్
మెఱయింపంబడు ధ్వాంతధూమమున శ్యా ◆ మీభూతమై [illegible]
ష్పరుచిస్ఫూర్తి వహించి పల్లవితమై ◆ భాస్వత్కరవ్యాప్తి చేఁ
బరివేషంబను పేరనిప్పుడు ఫల ◆ ప్రాయంబునై భాసిలెన్.

అహ్హాహా! సంపూర్ణ బాలభాస్కర మండలోదయసంబున మన్నయనంబులు సంతుష్టిఁజెందుచున్నయవి. బాలభాస్కరా! పద్మినీహృదయతస్కరా! అహస్కరా! మన్నమస్కారముఁ గైకొనుము.

గీ॥ అంధకారకర్దమదుర్ద ◆ మాబ్ధినష్ట
చేష్టలంగ్లిన సకల ◆ జీవములఁ బ్రబ
సరితేపటువిఘ్నతరరశ్మి ◆ సంచయమునఁ
గాచు భాస్కరునకు నమ ◆ స్కారమిదియ.

(అని నమస్కరించి)

మ॥ తనివిం జెందితి భోగభాగ్యముల మి ♦ త్రద్రోహముం జేయఁగా
లను బాంధవ్యము రోసితిన్ నరుని గె ♦ ల్వం జాలినం జాలకు
న్నను ప్రాణంబుల నెల్లఁ గోల్పడిన నా ♦ నందించెదం గాక; మై
త్రిని యూమంబుల మీఱనోపుదునె? తం ♦ డ్రీ! సూర్యనారాయణా.

మ॥ సరిసేయందగు నొక్కొ సూతకుల సం ♦ జాతుండు రాధేయుఁడై
కక్కరణిన్ గ్రీడికి సాటివచ్చునని గం ♦ గాసూనుఁడున్ ద్రోణుఁడున్
పరుషోక్తుల్ వచియించి నన్నుఁ గికు రిం ♦ పన్ రాజు గావించె; నే
నిరసింపంగలనే సుయోధనుని? తం ♦ డ్రీ సూర్యనారాయణా.

మ॥ కలిమిం గోరి చరించు పూరుషుఁడు స్వ ♦ ర్గప్రాప్తికిన్ దవ్వగున్
మలమూత్రాన్వితమైన యీ యొడలు సం ♦ సారాబ్ధిలోఁ గుళ్ళి భూ
తలబాంధవ్యముఁ బాయు; సద్యశము ని ♦ త్యంబంచు నూహించితిన్
నిలువం జాల సుయోధనుం దొలఁగి తం ♦ డ్రీ! సూర్యనారాయణా.

ప్రతిహారి:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా! దుర్యోధనమహారాజుగారు, మద్రదేశపురాజుగారు వచ్చుచున్నారు. దూరమునుండియే వారలఁ గనుంగొని యేలినవారికిఁ దెలియఁజేయవచ్చితి.

కర్ణు:—అట్లనా. నీవిచ్చట నాసనంబుల నలంకరించి సిద్ధముగనుండుము. (తనలో) ప్రాతఃకాలకృత్యములఁ గావించుకొని సత్వరమున వారల నెదుర్కొని మగుడ వచ్చెదంగాక.

(కర్ణుఁడు నిష్క్రమించును.)

ప్రతి:—నేఁ బుట్టినదిమొదలు కర్ణుని గోలిన మహానుభావుని జూచియెఱుంగను. తన కుమారుల నెట్లు పోషించునో, యాశ్రితుల నట్లు పోషించును. రాజనను గర్వము నుంతయు లేదుగదా? లోకంబునఁగల దరిద్రులు ధనికులైనను మిట్టి మిడిసి కన్నుఁగానక సంచరింపుచుందురు. ఇతనియెడల నయ్యది కనుపట్టదు. ఇతఁడు సూతుండని యందురు. అయ్యది నేను విశ్వసింపఁజాలను. కులబలంబులఁబట్టి మనుజుని చారిత్ర మించుక గ్రహింపవచ్చుఁగదా. ధర్మ రాజు చాల మంచివాఁడని యందురు. మంచితనంబునఁ గర్ణున కతఁడు సాటిరాడని నా యభిప్రాయము..... సడి వినంబడుచున్నది. వచ్చుచున్నారు. (అని యాసనంబు ల నలంకరించి యొకమూల నిలిచియుండును.)

(కర్ణశల్యదుర్యోధనులు ప్రవేశించి యాసనోపవిష్టులగుదురు.)

కర్ణ:—(దుర్యోధనుఁజూచి) మిత్రమా! మద్రరాజు నీ యభిప్రాయముతో నేకీభవించెనని తలంచెదను.

దుర్యో:—అందులకు సందియమేమి? నాయందభిమానముఁగల మద్రనాథుఁ డెప్పుడైన నేఁగోరినది నిరాకరించెనా? నిన్ను, మదేశ్వరుని జూచుకొనియేగదా యుద్ధభారము వహించితిని.

శల్యు:—అవునవును. నిన్నుఁ బుట్టించుటకు సంకల్పించియే బ్రహ్మ మున్ను మమ్ము సృజింపఁజేసియుండును.

కర్ణ:—భావము గూఢముగ నున్నది.

లగునది యొండు కల్ల యడి ♦ యాసను గెల్పునకై పెనంగినన్
డెగి నశియించు వంగడము ♦ దెప్పరపుంబవరమ్ము మేల్మియే.

రారాజా! నీవైన బాగుగ నాలోచింపుము. నష్టముఁ బొందెడువాఁడవు నీవు. అటుపై విచారించిన లాభము లేదు?

కర్ణు:—మద్రనాథా! ఇది యేమి పట్టి? యుద్ధమునకు వెఱచి యా సంధిప్రయత్న మూహించితివి.

ఉ॥ లగ్నముఁ బెట్టినాడ జయ ♦ లక్ష్మినిఁ బెండిలియాడ, నాదు బా
ణాగ్ని వెలుంగుచుండ నెవఁ ♦ డాహుతిఁ గాక తొలంగఁజాలు, నుద్విగ్నమనంబునన్ నరుఁడు ♦ తేరును డిగ్గి తొలంగఁ గృష్ణునిన్
భగ్నజిగీషుఁ జేయఁగల ♦ వాఁడను, వాడను పోరితంబునన్.

దుర్యో:—మద్రనాథా! మగుడ నిరుత్సాహపుఁ బలుకులఁ బలుకఁజనదని ప్రార్థించెదను. ఎంతటి బలియుండైన నిరుత్సాహంబున బలహీనుండగును. నీ వెఱుంగనిది కాదుగదా?

శల్యు:—నీ మంచికొఱకుఁ బలికినపలుకులు నిరుత్సాహంపుఁ బలుకులని నిరసింపఁదగునా! నే వచించునది యించుక విచారించి గల కల్ల, నిజము గ్రహింపుము.

గీ॥ ఆలమందల గెలుచునా ♦ డాలమందుఁ
గ్రీడితోడ నీసఖుఁడు పో ♦ రాడలెదె?
నాటికిని నేటి కేపాటి ♦ మేటియయ్యె
నరయఁ బట్టి రజ్జులమేటి ♦ యయ్యెఁగాక.

కర్ణు:—ఒకప్పు డపజయము వాటిల్లెఁగాక. అంతమాత్రమున వచ్చు నష్టమేమి?

గీ॥ సమయముంబట్టి భయదపం ♦ చాస్యమైన
నక్కకుంజిక్కి స్రుక్కిన ♦ స్రుక్కవచ్చు
నంతమాత్రాన నక్కసిం ♦ హంబుకన్న
బలిమిఁగలమేటి మెకమంచుఁ ♦ బలుకనగునె?.

దుర్యో:—మద్రేశ్వరా! నీయభిప్రాయమేమి? అంగరాజు వీరుఁడుకానేరడనియా యేమి?

శల్యు:—నాయభిప్రాయము నీవుగ్రహింప లేకుంటివా? కర్ణుడైనను మేటిపోటరియని వచింపుటకు సందియం బిసుమంతయువలదు. గాండివంబుగల గండుమగండగు కిరీటిధాటి మున్ను కర్ణుఁడేపాటిమేటియని నాయభిప్రాయము.

కర్ణు:—రాజా! శల్యునివాక్కుల నేలగణించెదవు.

గీ॥ వైరివీరప్రకాండ గం ♦ భీరజలద
పంక్తిమద్బాణ పక్ష ప్ర ♦ భంజనంబు
మించి నల్దెసలఁ బరాక్ర ♦ మించునెడలఁ
బంచబంగాళమైభీతిఁ ♦ బఱచకున్నె.

శల్యు:—కర్ణా! నీజన్మమెక్కడ, సహజశౌర్య ప్రతాపములగల యర్జునుండెక్కడ.

చం॥ భళి! భళి! నీదుచందము శ ♦ బాసని తెన్నగ మెచ్చవచ్చు; నీ
పలుకులకేమి లెమ్మ కఱ ♦ వా? పఱువా? హరిణంబుకాలుద్రో
ల్పులి బలివారులావరియె? ♦ పొచ్చెపుఁబుట్టుకఁ బుట్టిరాచ బె
బ్బులిఁ గికురింపగాఁదగిన ♦ పోటరిమిన్నవె? కన్నుఁగానవే?.

దుర్యో:—(తనలో) నేను నిరుత్సాహముఁజెంది యుద్ధముమా

నుమనను తలంపున శల్యుఁడిట్లు పలుకుచుండె. నేనిటనుండి పోవుటయే చాలలెస్స. (ప్రకాశముగ)

అంగరాజా! నిరుత్సాహముఁ జెందకుము. మద్రనాథా! యుద్ధకార్యంబులనరయవలయు. సంగరరంగమునం గలయుదము. (అని దుర్యోధనుఁడు నిష్క్రమించును)

కర్ణు:—మద్రనాథా! నీయభిప్రాయ మేమి? మర్యాద నతిక్రమించి నోరికివచ్చినట్లు పలుకుచుంటివి.

శల్యు:—అంగరాజా! నీవుమూర్ఛించి యుద్ధముఁజేసిన సుయోధనుఁడు వైరులకుఁ జిక్కి నశించినను. వెండియు యుద్ధము వలనఁ గల లాభ మేమి?

గీ॥ రణము జనులచావులకుఁగా ♦ రణము, క్రీడి
దరము పూరించినన్ నీకు ♦ దరము వొడము
నార్తి యించుక వచ్చిన ♦ నార్తినొందరు
నాహగము తేయవెపలుఁ బ్రా ♦ ణాపగములు.

కర్ణు:—ఏమిరా? కురురాజు వారలకుఁ బట్టుపడునా? చూచెదఁగాక.

ఉ॥ ఒక్కట మూఁడువేలుపుల ♦ నుక్కునఁదాకిన భీతిఁజెందఁజే
రెక్కిన మేటిపోటరిని ♦ యీనరుఁడాకిరరాజుఁబట్టు నీ
యుక్కిరిమిన్న, మిన్నకడు ♦ యుద్ధమునందున మద్రనాథ! నా
ముక్కునసూర్పులుండఁగను ♦ భూపతి వైరులచేతఁ జిక్కునే.

శల్యు:—కొంచెపు బుద్ధిఁగలవారికేమిచెప్పినను లాభము లేదు. రాజ్యము నశించుటకుఁ గాలమువచ్చినది.

కర్ణ:—దానికెవరేమి చేయఁగలరు. శాశ్వతముగనుండునని యెవరు నిశ్చయింపఁగలరు.

శా॥ క్రీడింగెల్చుట నాకశక్యమగుఁబో ♦ కీడ్పాటువాటిల్లు బో
యేఁడున్ శ్రీలఁదొలంగినం దొలఁగుఁబో ♦ ప్రేమంబు మాయిర్వురన్
గాఢం బెందునె? భాగ్యభోగముల న ♦ క్షయ్యంబు గాఁగల్గువాఁ
డేడీ చూపు మొకండునైనఁ గలఁడే ♦ యేమందు నీబుద్ధికిన్.

శల్య:—అంగరాజా? ఎట్లో యంగరాజ్యము దుర్యోధనుఁడొసంగినాడు? హాయిగ నింట ననుభవింపనేరక యుద్ధముఁ జేసి చావనేల? ఇంకను దుర్యోధను దూషింపరాదు. రాజ్యమాతఁడొసంగెఁ గాని యనుభవించుట నీలోనున్నది.

కర్ణ:—రాజ్యము శాశ్వతంబంచు నూహించితివా? నీరాజ్యము నీతో వచ్చునని యూహించియా యుద్ధమునకు వచ్చితివి?

మ॥ కడిమిన్ పాలనసేయునట్టి భువి నొ ♦ క్కండైనఁ గొంపోవఁజా
లఁడు; ఖండీకృత పంక్తికంఠుఁడుయుగా ♦ లంకారభూతుండు రా
ముఁడు భూమింగొనిపోయెనే సఖునకై ♦ పోరాడె? హా స్నేహపా
త్రుఁడు కర్ణుండు నృపోత్తముండు కృతకృ ♦ త్యుండటంచుఁ గీర్తింపరే.

శల్య:—నామాటవినుము. ఈవేదాంతము నీకు మోదాంతమగుగాని ఖేదాంతముగానేరదు. నీవు సాహసించి యుద్ధముఁ జేయఁ దలంపకుము.

ఉ॥ తాలిమిఁబూని నేగరికఁ ♦ ద్రవ్వి సుఖంబుగ నుండలేక గు
ఱ్ఱాలను తోలుకోక సమ ♦ రంబును సల్పగ వచ్చినాను పోఁ
గాలమటంచు నీవు మది ♦ గాఢతరంబుగఁ గుందువేళ ని
న్నాలమునందుఁ బోషిదను ♦ మా విను కవ్వడి సూతనందనా.

అందుచే నీకొక రాజనీతిఁ దెలిపెద నాకర్ణింపుము.

చం॥ అరుల పరాక్రమంబు స్వబ ♦ లాతిశయంబును మీఱియున్నచో
నరసిజనుండు సంధికిఁ బ్ర ♦ యత్నము సేయుట చాలలెస్స; సం
గరమునఁ బెట్టి నేర్పరియుఁ ♦ గార్యఫలంబును జెందనోపఁ డే
కరణి నిరైనఁ బొందిక య ♦ కర్జము; ఖడ్గము లాభహేతువే.

నాయందు దయయుంచి యీవిషయమై బాగుగ నాలోచింపుము. ఈ తరుణము మించినపైని విచారించిన నేమిఫలము. గుఱ్ఱములఁ బూన్చి రథముతో మగుడ నే వచ్చునంతలో నీ స్థితి విచారించుకొనుము. (అని నిష్క్రమించును.)

కర్ణు:—(మిక్కిలి విచార మభినయించి, నిట్టూర్పు విడిచి) ఆహా! కౌరవరాజ్యలక్ష్మికెట్టి దుర్దశ వాటిల్లనున్నది. సమస్తభూపాలమస్తకన్యస్తకోటీరమణివిరాజచ్చరణుండై, సకలైశ్వర్యసంపన్నుండై, కౌరవరాజ్యలక్ష్మీధురంధరుండై, వెలయు మదీయశ్రేయోభిలాషి, సుయోధనుం డెట్టి యిడుములఁ జెందునో కదా? పాండవవీరుల తలదన్నఁగల బలముఁ గల కౌరవసైన్యము దైన్యముఁ జెందుటకుఁ గారణ మగ్రాహ్యంబుగనున్నది...(అని యించుక విచార మభినయించి) అగ్రాహ్యమేమి? వైరులయెడ నభిమానంబుఁ గలిగి యైకమత్యంబు నశింపఁజేసి, యన్యోన్య వినాశములకుఁ బాల్పడు సైన్యము లెన్నియున్న నేమిలాభము?

గీ॥ అన్యభావంబుఁ దొలఁగి య ♦ న్యోన్యమైత్రిఁ
గలిగినన్ [illegible]బలమైన ♦ [illegible]

మైకమత్యంబుఁ దొరగిన ♦ నలఁతియగుచు
దోర్బలం బెంతయుండియు ♦ దుర్బలంబ.

శల్యుని పలుకులకు నా మనం బెంతయు నెరియుచున్నది. తుదకిట్లు పరిణమించునని యెఱుఁగనైతి.

మ॥ కడకెట్లో మముఁ గుంభసంభవుఁడు గం ♦ గాసూనుఁడున్ బాసిరా
బడుఁగుల్ పాండవ పక్షపాతులయి లా ♦ భంబేమియుం జేయ రి
ప్పుడు వారిర్వురు లేనికారణమునన్ ♦ మోదించెదం గాని; శ
ల్యుఁ డొకండివ్విధి దాపరించె, విధి దు ♦ ర్యోగంబు నూహించెనో.

ప్రకృతివైచిత్రి గ్రహించి మెలంగువాఁడు ధన్యుఁడు. ఆపదలకుఁ గ్రుంగి సౌఖ్యములకుఁ బొంగివఱలువాఁడు పామరుఁడు.

సీ॥ తుంగ తరంగసం ♦ దోహంబుఁ గలవార్ధి
పులినావశిష్టమై ♦ వెలయుచుండు
హాలాహల సదృశ ♦ జ్వాలలం గలవహ్ని
శిశిర స్వభావంబుఁ జెందుచుండు
చుంబితఖశిఖర ♦ శోభితభూధ్రంబు
ధూళిలవంబుగాఁ ♦ దొరలుచుండు
ఖండితక్ష్మాధ్రప ♦ క్షంబులం గల వజ్ర
మత్యల్ప తృణతుల్య ♦ మగుచునుండు.



గీ॥ కాల పరిపాకమున లేమి ♦ కలిమిఁ జెందుఁ
గలిమి లేవడిం గుండుటఁ ♦ దలఁపనేల
ఘనులనడపడి కాలంబు ♦ ననుసరించుఁ
[illegible]

అవమానంబు ఫలంబని నిశ్చయించి గెలుపుఁదలంపక రాజకార్య మరసెదంగాక. నాయోగము ననుసరించు బద్ధిఁగల నేను రాఁబోవునది విచారింపనేల?

గీ॥ పరులు దూషింపఁగలరను ♦ భయముఁజెంది
చాల దాక్షిణ్యముం బూని ♦ సంశయించు
బుద్ధితోఁ బ్రవర్తించెడి ♦ పూరుషుండు
సిరులకున్ దూరుఁడగు నంద్రు ♦ శిష్టజనులు.

శల్యుఁడునన్ను నిరుత్సాహునిఁ జేయ యత్నింపు చున్నట్టు లూహింపుచుంటిని. తుదకు ఫలితమెట్లున్నను పోరాడ నిశ్చయించితింగదా? సుయోధనునకు జయము లభించునో లభింపదో ప్రస్తుత మూహింపఁజాలను. అందుచే సైన్యమెక్కుడుగ వ్యయముఁ జేయఁదగదు. అయ్యది రాజనీతియుఁగాదు.

గీ॥ అల్ప ఫలితంబునకు హెచ్చు ♦ వ్యయము సేత
హానికిం గారణంబగు ♦ నంద్రు బుధులు
అధికఫలమున్న స్వల్పవ్య ♦ యమున హెచ్చు
రక్షణము సేత, విబుధుల ♦ లక్షణంబు.

రథమువచ్చు సడి వినవచ్చుచున్నది. శల్యుఁడు వచ్చుచున్నట్టు లున్నది. యుద్ధమువలదని మగుడ నితఁడు పల్కినచోఁ గర్వముగ మందలించెదఁగాక.

శల్యు:—(ప్రవేశించి) అంగరాజా! వచ్చినది విమానము.

కర్ణు:—ఛీ? వృథామంగళపాఠకా.

శల్యు:—అట్టుపలికిన లాభమేమి? నామాట వినుము. దురభి

మానమున లాభము సుంతయు లేదు. పాండవులతో సఖ్యముఁ జేయుదేని నీకుఁ గొంత రాజ్య మిప్పించెద.

కర్ణ:—రాజ్య మిప్పించెదనని నీ వనినంతమాత్రమున మిత్రద్రోహమునకుఁ బాల్పడుదు ననుకొంటి వేమి?

ఉ॥ మోహవశంవదుండనయి ◆ మూరెడు భూమికి నాసజెందుచో
నాహవమందొలంగఁదగు ◆ నయ్యది ధర్మమె? శాశ్వతంబె యీ
దేహము, దుర్యశంబు నలు ◆ దిక్కుల మబ్బయి ప్రాకునన్న సం
దేహమె? యింతకుందగునె ◆ స్నేహముపట్టున ద్రోహ మెంతు నే.

శల్యు:—అర్జునుని పరాక్రమము నీవు బాగుగ నెఱుంగవు గావున నిట్టి శ్రీరంగనీతులఁ దెలుపుచుంటివి.

ఉ॥ అర్జునుఁడన్న పందయని ◆ యాత్మఁ దలంచితె? వైరిభర్తనో
పార్జునుఁడంచెఱుంగుము మ ◆ హాహవదోహద కేళిలాలసో
త్సర్జిత మృత్యురూప శర ◆ చాపగుణధ్వని పోలుఁ గాండము
గ్గర్జన ధర్మరాణ్మహిష ◆ కంఠఘుళం ఘుళ కాంస్య కింకిణీ.

కర్ణ:—భళిరా? పాండవమాగధా! బాగుగవర్ణించితివి.

శల్యు:—అట్లనినంజాలదు. పిన్నతనంబునుండియు విలుఁబూని పోటరిననుచుఁ జెలంగుచుంటివే! మహావీరు నొక్కనినైన గెలువఁ జాలితివా?

కర్ణ:—గెలుచుటయేగాదు. ఆమహావీరుండు నాధాటి కోర్వఁజాలక పట్టణంబొండొసంగి సంధిఁగావించుకొనియె.

శల్యు:—ఇది యొకనూతనాంశము. ఇంచుక దెలుపుమాకర్ణించి సంతోషించెదను

కర్ణు:—కోరినవాఁడ వగుటనేఁ దెలిపెద వినుము.

ఉ॥కంధితరంగసంఘముల ♦ క్రైవడినచ్చు పశింబుఁద్రుంచి, ని
ర్బంధమునన్ గళింగవిభు ♦ బాలిక మిత్రున కిచ్చి యా జరా
సంధుని గెల్చి; సంధికినొ ♦ సంగిన యాతని దేశమొంది, ద
ర్పాంధుఁడనై చరాచర భ ♦ యంకరవీరుఁడనాఁ జెలంగితిన్.

శల్యు:—ఇట్టి విశేషముల నేను సహితము వర్ణింపఁ గలను.
వినుము.

ఉ॥వాలమునన్ నగంబులను ♦ వక్కలఁ వ్రక్కలఁజేసి, మత్తశుం
డాలములన్ వధించి, సుభ ♦ టప్రకరంబుల పెంపణంచి, శా
ర్దూలములన్ నఖంబులను ♦ ద్రుంచి, సుధాంబుధిఁ ద్రావి, త్రేన్చి, మా
ర్జాల మొకండు పూర్వమునఁదు ♦ రంబున శౌర్యముఁ జూపె నీవలెన్.

కర్ణు:—నేఁబలికినది కల్లయనియా నీయభిప్రాయము.

శల్యు:—అందుల కొకసందియమా?

కర్ణు:—జరాసంధుఁడు నాతోఁబోరాడి యోడి మాలినీనగరము
నాకొసంగినట్లు నీవు వినియుండ లేదా?

శల్యు:—(తనలో) అవునవును. మఱచితి. (ప్రకాశముగా)
పరశురాముని మోసపుచ్చినట్లు బ్రాహ్మణవేషంబున జరా
సంధుని యాచించియుందువు.

కర్ణు:—మద్రనాథా! ఇట్టి యధర్మమునకుఁ బాల్పడుచుంటి
వేమి. కురుదేశంబునకు ధూమకేతువు నీరూపంబున నవత
రించెనా యేమి?

సీ॥ వృషచక్రవర్తి చేఁ ♦ బెనుపొందుటం జేసి
పృథ్వీనామంబున ♦ వెలయుచుండు
వసుధాసతీఫాల ♦ భాగంబునందునఁ
బొలుపొందు సింధూర ♦ తిలకమనఁగ
నలరి, శ్రీభారతీ ♦ లలనాలలామలన్
గారాబుచెలులతోఁ ♦ గలసి మెలసి
వరచక్రవర్తుల ♦ బాహుపంజరములఁ
జిలుకచందంబు ము ♦ ద్దులఁ జెలంగి
గీ॥ తనరు భారతమాతకుఁ ♦ దనయుఁ డనఁగఁ
గ్రాలు కౌరవసామ్రాజ్య సా ♦ మ్రాజ్యలక్ష్మి
కాడుఁ జెందఁగఁ దలచితే ♦ కౌరవేశ
యెట్టి యపకార మొనరించె ♦ నిట్టులాడ.

శల్యు:—నను దూషింపనెంచితివిగాని, నీ మిత్రుఁ డొనరించు దోషముల గ్రహింపకుంటివి.

గీ॥ విషముఁ బెట్టుటకుం దోడు ♦ పృథ్వి నపహ-
రించి, కానలపాలొన ♦ రించి, ద్రుపదు
బాలికం బట్టి, కటకటా! ♦ పరిభవించెఁ
బాండవులు చేయు నపకార ♦ మెందు గలదె.

కర్ణు:—ఇట్టి వాగ్ప్రసంగముతో నేమి. కురుపాండవు లన్యోన్యము చెనకుచుం గావించుకొనిరి. మన కా ప్రసంగముతోఁ బని లేదు. తనకుం గర్తవ్యమైన విధి మనుజుం డొనరించుట ధర్మము.



శల్యు:—అర్జుని కీడు వచ్చునని గ్రహించియు నగ్నిహోత్రమును బడుట యేటిపాడి?

కర్ణు:—ధర్మమన నెట్టిదియో నీ వెఱుంగవు.

చ॥ మను మనుజుండు కార్యముల ♦ మున్ మది నెంచగరాదు లెస్సయై
నను చెడుగైనఁ గార్యములు ♦ నర్చుట ధర్మము, తత్ఫలంబు రా
జనుభవ మొందుఁగాక; సమ ♦ రావని నాదు రథంబు క్రుంగినన్
దనువు దొలంగు; దోషరహి ♦ తంబుగ నావిధి నే నొనర్చెదన్.

మద్రనాథా! నా మనోనిశ్చయముఁ దెలిపెద వినుము.

గీ॥ రాజవరునకుఁ గలవు మా ♦ ర్గములు రెండు
పిడుగులంబోని యలుగులం ♦ దొడిగి రిపులఁ
ద్రుంచి, రక్తాన్నమున్ భుజి ♦ యించుటొండె
కోర్కిలు పులిఁబోలిపోరాడి ♦ గూలుటొండె.

శల్యు:—అవునవును. ఆ మార్గములు రెండును రాజవరునకు గాని సూతునకుఁ గావు. అంగరాజా! గాండీవికి విజయుండను నామముఁ గలదని యెఱుంగుదువా?

కర్ణు:—నేనుసహితము విజయుండనే.

శల్యు:—అదియెట్లు?

కర్ణు:—గాండీవికి గాండీవంబను విల్లెట్టిదియో యట్టిదియే నా విజయంబను విల్లుసహితము. అందుచే నే విజయుండ నగుదు. ఈ మహాధనుస్సు వహించియే భార్గవుండు క్షత్రియలోకంబును సంహరించెను. ఇప్పుడైన నీ సందియంబు నివారింపఁబడుఁగాక.

శల్యు:—విజయంబను విల్లొందుచేఁబూని పౌండ్రకవాసుదేవు నింబలె నశింపగలవు. గాండీవియెక్కడ. నీవెక్కడ.

చం॥ పలువురెఱుంగఁజాలునొకొ ♦ పాండవులంగలసత్తు, రజ్జులన్
బలుకగవచ్చు, సూతసుతు ♦ పల్కులు ముల్కులఁబోలిదాయలన్
జెలువనఁగూల్పఁజాలునొకొ, ♦ భీముడు, గద్దతి పెద్దరాచ బె
బ్బులియగు కిరీడి, కైదువులఁ బూని చెలంగిన నాసలున్నవే.

కర్ణు:—(తనలో) ఊరుకున్నకొలంది యీ మూర్ఖుఁడు నోటికివచ్చినట్లు పేలుచున్నాడు. (ప్రకాశముగా మిక్కిలి కోపముతో)

మ॥ మతిలేదో జ్వరసంధి యుద్భవిలెనో ♦ మద్యంబు గంజాయిఁ ద్రా
గితివో నిన్నదినమ్మనన్ నిజముగాఁ ♦ గీడ్పాటు వాటిల్లు దు
ర్మతి నా సారథివాటచే బ్రదికితో ♦ రా! లేనిచో నిప్పుడే
శితబాణాళి మహాప్రహారముల నీ ♦ శీర్షంబు ఖండింపనే.

చం॥ తగిలి వినుంగనుంగొనక ♦ తక్కని కారులఁ బ్రేలి యేపుమై
జగడము సేయనేర్పుగల ♦ జాణలు వారలటంచు దాయలన్
బొగడుచు నుంటివేనునొక ♦ పోటుగ నేయని చాలఁజాలు నీ
మగబిరుదేల? యూర మిడి ♦ మాసతనంబెడవోయొ దబ్బలీ.

మూర్ఖా! నోటికివచ్చినట్లు పేలుట యెఱుంగుదువుగాని నా పరాక్రమము నీవేమి యెఱుంగుదువు.

ఉ॥ దంపతుఁ జేరి వైరిభుజ ♦ దండము లొక్కటఁ ద్రుంచి దివ్యకో
దండ విముక్తకాండ జని ♦ తంబగు వహ్ని రణాంబులోన వే
దండములన్ తురంగ భట ♦ తండములన్ దహింపఁ గల్గు దా

దంతనూ, నీదు తూపులకు ♦ దండము దండము దండమంచు దో
ర్దండము లెత్తి మ్రొక్కు రిపు♦తండము గండముఁ దక్కియుండగన్.

శల్యు:—నీ వంతటికార్యముఁ జేయఁజాలనివాఁడ వైనను సంత
సించెద. ఎందుచేనన,

ఉ॥ పోలుపరాని పోటరియ ♦ పోరుటకుందగు, సూతుఁ డాజికిన్
జాలఁడు, నిక్కువంబయినఁ ♦ జాలుదునంచుఁ దురంగమంబులన్
దోలుటఁ దక్కి యొక్కఁడు ధ ♦ నుస్సున వైరి నెదిర్చి, పోటియున్
జాలును; వంధ్యకాన్పుఁ గనఁ ♦ జాలినఁ జాలదె గ్రుడ్డిబిడ్డయున్.

కర్ణు:—నీ నాలుకఁ ద్రుంచినంగాని యీ యున్మత్తప్రలాపంబులు కట్టువడవు.

గీ॥ ఈరసముఁబూని విర్రవచ్చు ♦ పోర నన్నుఁ
బిలుకుమార్చ్చ నటించును ♦ పలుకుచుంటి
వింక ప్రేలిన నీదులా ♦ వింక నాదు
నారసంబుల నినుఁజేతు ♦ నీరసంబు.

శల్యు:—బాగుగ నాలోచించుకొనుము. యుద్ధము వలదు సుమా. ప్రాణాపాయకరముసుమా.

కర్ణు:—నీ పలుకులకు భీతిలెదనాయేమి!

గీ॥ ఓహటించక వైరుల ♦ నోహరించి
ఆలమొనరింపఁబో నడి ♦ యాసయనుచు
మదినిఁ బయలోపకుండఁ బ ♦ ల్కెదవు, నిను
శిక్షించి పంపుచునే కర్ణుఁడు ♦ [illegible].

శల్యు:— అట్లయినచో నిక నా యభ్యంతరము వలదు. భీతిల కుండ ధైర్యముగ నుండుము.

గీ॥ వర్గములఁ బూని హరి వారు • నముల వోలె
ప్రళయసమయజన్యగర్జాను • బంధమైన
దేవదత్తంబు పూరించి • దిక్కులదర;
వచ్చుచున్నాఁడు చూడు వి • ష్వచ్చు నేఁడు.

పోరాడ నిశ్చయించితివేని నిస్సాణంబు మ్రోగించి సైనికులు యుద్ధమునకు సిద్ధముగ నుండునట్లు జేయుము.

కర్ణు:— అయ్యది యెంతసేపు. (అని ప్రక్కకుఁదిరిగి) కౌరవ పృతనాధిపా!

మ॥ దళితానంతదిగంతమై, ఘణఘణం • ఘాణంఘణ ధ్వానమై,
ప్రళయాభీలపయోదనిష్ఠురరవ • ప్రారంభసంరంభభృ
న్నిలయంబై, విజయాంకకర్ణయుగళీ • నిర్ఘోష నిర్ఘాతమై
చలితారాతివితానమైన, రణని • స్సాణంబు మ్రోగింపుఁడీ.

శల్యు:— అహాహా! మహావీరశిఖామణివి. నిన్నుఁబో.....

కర్ణు:— అధికప్రసంగముఁ జేయుదేని నీ నాలుక ఖండించెద. వేగమే రథముఁ ద్రిప్పుము. (అని నిష్క్రమింతురు.)

శల్యు:— వాగ్దానముఁ జేసినవాఁడ నగుటచే నీయాజ్ఞ నుల్లంఘింపఁజనదు. (అని నిష్క్రమించును.)



శ్రీ

# విజయవిజయము

## తురీయాంకము.

---

కురుక్షేత్రము. ప్రవేశము—భీముఁడ

---

భీము:—"కర్ణునితో ధృష్టద్యుమ్న సాత్యకిప్రము
చుందురు. నీ వొకరయోర దుశ్శాసను మాఁ
దుర్యోధనుఁడు వచ్చినచో నర్జునుండడ్డగిం
త్థామ యుద్ధమునకు రానని ప్రతిజ్ఞఁజేసెను.
దుశ్శాసనువధియింపవచ్చు"నని శ్రీకృష్ణుండు
( తెరపుఁజూచి ) కృష్ణుఁడాజ్ఞాపించినట్లు ల
మ్నుఁడు, సాత్యకియుఁ గర్ణునితో నతితీవ్రము
వారు. ఇదియే మంచిసమయము. దుస్సేను
యుఁ గనుపట్టుకున్నది. ఓరీ! పశువా! దుశ్శాస

చం॥ కనికరమున్ దొఱంగి సతి ♦ గాసిలఁజేసిన దుష్టచిత్త
మనమునఁ, జేసినట్టి యవ ♦ మానము కౌరవ నాశనా
యనలము భంగిఁ బ్రజ్జ్వలిత ♦ మై కనుఁదమ్ముల, నె
గనుపడి నిన్ను నొక్కత్రుటి ♦ కాలములో దహియింప

ఓ కౌరవవీరులారా! మీయువరాజెచ్చట డా
విధవవలె డాఁగియున్నాఁడా యేమి?

గీ॥ యమతనూజునాజ్ఞా శృంఖ ♦ లమున బద్ధ
మయ్యె భీమమత్తగజంబ ♦ టంచు నరసి
సభను చూపించె నసమాన ♦ సాహసంబు
నిపుడు రాదేమి? నేడు వి ♦ శృంఖలుండ.

ఓ కౌరవయోధులారా! మీ రేడ పాండవులతో యుద్ధ మొనర్చు టేడ. కురువంశము నశింపఁజేయుటకు నే నొకండఁ జాలనో? మిమ్ముల మీసేని వధించుటకు నొక్క త్రుటికాల మైన నా కక్కఱలేదు. పాండవులనిన నల్పులని మీ యభిప్రాయమా యేమి?



గీ॥ సింహశార్దూలములతోడఁ ♦ జెలఁగి హరిణ
కోటి పోరాటమును సల్ప ♦ గోరినట్లు
పాండవానీకములతోడ ♦ బవరమునకుఁ
గడఁగి మోహరించు తలంపు ♦ కౌరవులకు.

ఉ॥ పూరుఁ బటించు నించుకయు ♦ సూతజు గీతజు లెక్కసేయ, వి
స్తార [illegible] ననుచు ♦ కల్యుని గల్యునిఁ గంటఁ జూడఁ డెవ్
వాఁడు బల్లిదుండ ననుచు ♦ ద్రోణజు గిణజు సాటిసేయ, దు
ర్వార గదాహతిన్ గురున్ప ♦ పాలునిఁ గాలుని ప్రోలికంపెదన్.

(అని తెరవైపుఁ జూచి) ఆః క్రూరచిత్త! పాండవద్వేషి! ఇప్పటికి నాకంటఁ జిక్కితివిరా?

ఉ॥ [illegible] నాడుమది ♦ బన్న మొనర్చిన నిన్నుఁ గానమిన్
[illegible]

ప్రమ్మరి యాకటన్ బడలు ♦ కోర్విల్పు లిక్కైనది యుంటిఁ జేసు; న
యమ్మమంగండెవండు నను ♦ నంకిలి సేయఁగలఁడు నక్రనై.

ఇఁక నేఁ గాలము వెచ్చింపఁజనదు. అసహాయుండై చిక్కి-
నాఁడుగదా?

సీ॥ విదళితవిపులోరు ♦ హృదయకటాహాగ
క్షాఘవారినిస్నాన ♦ మాచరించి
వైరిభూధవరక్త ♦ వారిధారాధౌత
శీతనాంబరములఁ ♦ బ్రీతిఁ దాల్చి
భయదగదాహతి ♦ భగ్నీకృతలలాట
పట్టరక్తము ఫాల ♦ పదవిఁ దీర్చి
క్రూరబుద్ధికపాల ♦ సారససంభూత
రక్తమక్షు మధువను ♦ రక్తిఁ దాగి
గీ॥ దుస్ససేనుని మాంసంబుఁ ♦ దుష్టిసార
గించి; మిగిలియున్నది కాక ♦ గృధ్రగములకు
నామె తలనిత్తు; భయద సిం ♦ హంబునంగ;
నన్య రాజన్యయముఁడనై ♦ జన్యమునను.

కౌరవవంశపాంసనా! నా బాహుపంజరమున నిపుడు చిక్కి-
ప్రుక్కితివిరా. (అని గదాదండముఁ ద్రిప్పుకొనుచు భీముఁడు
నిష్క్రమించును.)

దుర్యో:—(మూర్ఛఁదేరి) తమ్ముఁడా! దుశ్శాసనా! భీతిలకుము. ఇదే వచ్చుచున్నాఁడ.

సూతు:—మహారాజా! శాంతింపుము. శాంతింపుము.

దుర్యో:—ఓయీ! రథము రణరంగమునుండి తొలంగించితివేల?

సూతు:—ప్రభూత్తమా! ఇంచుక తాల్మిఁబూనుడు.

దుర్యో:—ఓరీ! రాజద్రోహీ!

గీ॥ పాండవాధముఁ డొకరుండు ♦ గండుమిగిలి
తమ్మునుర్రును తెగటార్పఁ ♦ దలఁచునపుడు
నాదు గారాబుఁదమ్మునిఁ ♦ బ్రోచి నీయ
నేగు నన్నుఁ నడ్డిలిచేయు ♦ దే దురాత్మ.

సూతు:—రాజాధిరాజా! నేను దురాత్ముఁడనే. యువరాజగారు వీరస్వర్గముఁ జేరిరి.

దుర్యో:—హా! తమ్ముఁడా! దుశ్శాసనా! మదాజ్ఞానువర్తీ!

సూతు:—దేవా! ఊరడిల్లుఁడు. గురుపుత్రుండదే వచ్చుచున్నాఁడు.

దుర్యో:—హా! కురువంశవిభూషణా! సోదరరత్నమా! భీష్మద్రోణు లడంగినను, సుతులు, చుట్టములు నశించినను, గెలువఁగలనను నాశావృక్షమునను నీ కతనఁ జలనము పుట్టినదిగదా! తమ్ముఁడా! ఇఁక రాజ్యమేల? యుద్ధమేల? హా! సోదరరత్నమా! దళితరిపుసేన! దుస్ససేన!

అశ్వ:—(ప్రవేశించి) జయము. జయము. మహారాజా!

సూతు:—(తనలో) వారువంబుల విశ్రమింపఁజేసెదంగాక.(అని

దుర్యో:—ద్రోణనందనా! మాకిటి యేటిజయము.

సీ॥ ఎవ్వని పేర్విన్న ♦ నేడుసంభ్రమంబులు
జీవనంబులఁబాసి ♦ చెడినశించు
నెవ్వనిఁగాంచిన ♦ ఋషులాదిదేవతల్
గడగడభీతిచే ♦ వడఁకువార
లెవ్వని సభలోన ♦ నెదిరింపజాలక
భీముఁడంతటివాఁడు ♦ బెండువడియె
నెవ్వని బల్మికి ♦ నెంతటిజోదైనఁ
బిఱికితనంబున ♦ వెన్నుసూపు

ఆ॥వె॥ నెవని పెట్టిదంపు ♦ రవలి వీనులవిన్నఁ
బాండురాజు సుతుల ♦ గుండె మండు
నట్టి నాదు తమ్ముఁ ♦ డట్టి గండుమగండు
దిక్కులేక నేడు ♦ తెగినవాఁడు.

అశ్వ:—రాజా! ఊఱడిల్లుము. గతించినకార్యమునకు విచారించిన లాభమేమి? తొలుతనే యుద్ధము వలదని పెద్దలు నుడివిరిగదా?

దుర్యో:—హా! తమ్ముఁడా! మదాజ్ఞానువర్తీ!

సీ॥ కడిఁదిబొబ్బ మెకంపుఁ ♦ గడిమిలావులమీఱఁ
గాఁజాలు కర్ణుఁడు ♦ ఘనబలుండు
స్థాణునిద్ఘ్నని ♦ ద్రాణఁజేయఁగలట్టి
గురుతనూజాతుండు ♦ గురుబలుండు
శాత్రవకాంతార ♦ సంహారఖేలనా

కొండలన్నియు గుండ • పిండిసేయగనోపు
కల్పాంతశక్రుమహా • చ్ఛల్యాసముచే
ఆ॥ సమునగజపవాన • సత్వమూర్తిని నీవు
పోరియును ఖుంగోలు • పోవుటయుఁ
గంజభవునివారిత • కారణంబగుఁగాక
గాలిచూలిబలిమి • కారణంబె.

అశ్వ:—రాజా! ఎవరున్ననేమి? కాలధర్మము మీఱ నెవ్వని తరము. మిగిలినవారిఁ జూచియైన సంతసింపుము.

ద్రో:—ద్రోణనందనా! మిగిలినవా రెందరున్నను నా కేమి గలదు.

గీ॥ ఘనతరంబగు నుద్యాన • వనమునందు
నెన్నియున్నను వృక్షంబు • లేమిఫలము
సౌరభంబున సకలది • క్చయమునించు
స్థలకమలమొక్కఁడేనియుఁ • జాలదొక్కొ.

అశ్వ:—రాజా! విచారించిన లాభమేమున్నది? నా పలుకు లాలకించిన బాగుపడియెదవు. కర్ణుండును నిన్నుఁ బ్రోవఁ జాలఁడు.

దుర్యో:—నన్నుఁ బ్రోవఁజాలఁడా? ఏమనియెదవు?

అశ్వ:—అనుట కేమున్నది? నా పలుకులంగల నిజము గ్రహింపకుంటివి. అందులకు విచారింపుచుంటిని. మన్మనోభిప్రాయముఁ బూర్ణముగఁ దెలిపెద వినుము.

శా॥ వాచాలుని కర్ణు నమ్ముకొని బా • హాటంబుగా నీవు పెం

శీవిం జూపినఁ గీడుమూడునని ఁబో ◆ టిన్ బోరుబంపెవ్వఁడీ
వా? వాఁడా? యెవఁడోపుఁ గ్రిడిఁదునుమన్ ◆ బార్థుధిగం జెల్పుమా.

దుర్యో:—నిరుత్సాహంపుఁ బలుకులు నీ వెన్ని పలికినను సూది మోపునంత నేలయైనఁ బాండవుల కీయఁజాలను. పితార్జితమైన రాజ్యరమను పాండవులకెట్లొసంగఁగలను.

అశ్వ:—ఒసంగుటకు మానుటకు నీవెవండవు. ఇట్లు పలికినవారలనేకులు గలరు.

ఉ॥ ఆరయ నెందఱెందరు ధ ◆ రాధిపులేలి నశించియుండ రీ
ధారుణియెల్ల నొక్కనికిఁ ◆ దక్కెనె? యెయ్యది శాశ్వతంబు? ని
ష్కారణ వైరమూని యనిఁ ◆ జచ్చుటయే ఫలమొండుగాక, దు
ర్వారబలాన్వితుండెవఁడొ ◆ వాఁడె సమస్త ధరాధినాథుఁడౌ.

దుర్యో:—ఆఁ. ఏమీ? కురురాజ్యరమానాథుఁడగు దుర్యోధనుండా నశించునని పలికెదవు.

అశ్వ:—అట్లు నేఁ బలుకఁగలనా? లోకనైజముఁ దెలుపుచుంటి.

ఉ॥ “ఏను బలాన్వితుండను మ ◆ హీస్థలి నెల్లను నేన యేలుదున్
గాని యొకండు నన్ను నరి ◆ కట్టఁగఁజాలఁడు; నా పురంబునన్
భానుఁడు గ్రుంకఁజాలఁడ”ను ◆ పల్కులఁ బల్కిరి రాజులెందఱో
మానవనాథ! యీ దురభి ◆ మానముతోఁ బనియేమి చెప్పుమా.

దుర్యో:—గురుపుత్రా! రాజద్రోహమునకుఁ బాల్పడుచుంటివా?

అశ్వ:—రాజద్రోహ మిందేమున్నది. నీమేలు గోరువాఁడఁగాన మంచిచెడ్డల నెఱుంగఁజెప్పితి. కర్ణుఁడు పలికెడి పలుకులఁబట్టి యీ సాహసింపుచుంటివి.

చం॥ అఱచెడి వెఱ్ఱిబీరముల ♦ యందుఁగలట్టి నిజంబుఁగల్ల నీ
వెఱుఁగవుగాన సూతసుతుఁ ♦ డెట్లనినం దలయూఁతు విట్టి ప
ల్లఱపులు నిక్కవంబుగ జ ♦ యంబొనగూర్చునె? రజ్జులాడినన్
వెఱచెడువాఁడె ఫల్గుణుఁడు ♦ వెంబరవిత్తులు నీవుఁ గర్ణుఁడున్.

దుర్యో:—నాకు గర్భవైరులగు పాండవులతో నెట్లు చెలిమి వాటిల్లునని నీవూహింపుచుంటివి. ఇట్టి పలుకులవలన లాభమేమున్నది.

అశ్వ:—రాజా! నీకు సోదరులగు పాండవులు గర్భవైరులా? ఎట్టిసంబంధము లేని కర్ణుఁడాప్తుఁడా? ఏమి యీ విరుద్ధాభిప్రాయము.

ఉ॥ బద్ధవిరోధు లెన్నఁదగుఁ ♦ బాండవులంచుఁ దలంచి, కార్యసం
సిద్ధియొనర్పఁగాఁదగిన ♦ స్నేహితుఁ డాప్తుఁడు కర్ణుఁడంచు ద
ర్పోద్ధతి సాటియెవ్వరని ♦ యున్నతినుండెద వీవు; కర్ణుఁడున్
యుద్ధమునందుఁజచ్చిన ను ♦ యోధన! సాధనమేమి చెప్పుమా.

దుర్యో:—(విననియట్లు నటించి, తెరవైపుఁజూచి) ఎవఁడురా యచ్చటనున్నది?

సూతు:—(ప్రవేశించి) ఏమియాజ్ఞ?

దుర్యో:—రథము యుద్ధమునకు సిద్ధమగుఁగాక.

సూతు:—అమోఘము రాజాజ్ఞ. (అని నిష్క్రమించును.)

అశ్వ:—రాజా! నేఁ జెప్పునది బాగుగ నాలోచించుకొనుము. నీకుపదేశించుట దోషమని యెఱుఁగుదు. పామునకుఁ

బాలు విషమించుభంగి సజ్జనోపదేశమున మూఢుఁడు ప్రకో పించుఁగదా? (అని అశ్వత్థామ నిష్క్రమించును.)

దుర్యో:—ఈ పలుకులకు దుర్యోధనుఁడు భీతిలునా? వైరుల వధించి సామ్రాజ్య వైభవములఁ బడయదలఁచుట నృపుని స్వభావముగదా? యుద్ధక్రమ మెట్లున్నదియుఁ బరీక్షించెదం గాక. (అని నిష్క్రమించును.)

---

రణరంగము.— కురుక్షేత్రము.

---

(దుస్ససేనుని శిరముఁ దొడపై నిడి కర్ణుఁడు విచారింపు చుండును. శల్యుఁడోదార్చుచుండును.)

కర్ణు:—ఈ మృతకళేబరముఁ జూచుటకు నాకును లెట్టి పా పంబుఁ గావించెనో గదా? హా! దుశ్శాసనా!

గీ॥ అప్రహతసుప్రతాపంబు ♦ సుప్రసిద్ధ
శౌర్య గాంభీర్య బలసాహ ♦ సములఁగలుగు
నీవు లేకుంటఁ గురువాహి ♦ నీగణంబు
లోపముం జెందె నధిక సం ♦ తాపమునను.

శల్యు:—పాపము నీవిట్లుచింతించిన లాభమేమి? చచ్చినవా రలు లేచి వత్తురా? కాలము విషమించినది.

కర్ణు:—హా దుశ్శాసనా! నీవు చచ్చిపడియుండుటఁ జూచు చున్న యీ కనులు నన్ను మోసపుచ్చుచున్నవి.

గీ॥ చచ్చిపడియుండుటద్ది ని ♦ శ్చయమయ్యెనఁ
జూచుచున్న కొలంది నా ♦ చూడ్కి నన్ను
మోసపుచ్చెడి; బమ్మెర ♦ పోయెబుద్ధి
లెమ్ము నేను కర్ణుఁడఁ గౌఁగి ♦ లిమ్ముసఖుఁడ.

శల్యు:—కర్ణా! సైన్యాధిపతివయ్యు నీవు చింతింపుచున్న, మిగిలియున్న సైన్యంబు ధైర్యముఁ జెందును. యుద్ధమునఁ జచ్చినవారిఁగూర్చి దుఃఖించుటయా కర్తవ్యము?

కర్ణు:—మద్రనాథా! మఱి యుద్ధమెందులకు?

మ॥ కలయో నిక్కమో వచింప నరుదై ♦ కన్పట్టె; నా కెయ్యెడన్
చెలియై చుట్టముకన్న మిన్నయయి ను ♦ శ్రీరాజ్యభోగంబులన్
గల దుశ్శాసనుఁడిట్లు చచ్చిపడియుంటం ♦ గాంచితిఁ గ్రుక్కితిన్
పాలుపుందక్కితి నెట్లు పోరుదు ద్రవీ ♦ భూతాంతరంగుడనై.

శల్యు:—విచారింపవలసినదే. ఎవరుఁ జావకుండ యుద్ధముఁ జేయగలమా? చచ్చినవారిఁగూర్చి విచారింపుచున్న లాభమున్నదా? నీ వేడ్పు చాలించి వేగ మేరమ్ము. నేను దుర్యోధనుఁ జూడవలయు. (అని శల్యుఁడు నిష్క్రమించును.)

కర్ణు:—అవునవును. లాభ మేమున్నది. సర్వము సూన్యము. నా జన్మమే సూన్యము. చచ్చిచెడి యుద్ధముం జేసి గెలిచిన నానందించువార లెవరు. భార్గవుని శిష్యుండనై, విజిత జరాసంధాదివీరుండనై, విజయధనుర్ధరుండనై, దుర్యోధనునంతటివానికి మిత్రుండనై, కౌరవసేనానాయకుఁడనై యుండియు, మానవాధముండొకండు, దుశ్శాసనుఁ జంపెఁ

గదా! ఆః కూరిరా! వాయునందనా! నే లేనిసమయంబునఁ జంపిన నిన్నుఁ గర్ణుఁడేమిచేయునో గ్రహింపకుంటివిగా? నేఁజేయు నుపకారమునకుఁ బ్రత్యుపకారము బాగుగఁ జేసితివి.

చం॥ మనుపాకమారు నిన్ను నొక ♦ ముల్కినిఁగొట్టి రథాశ్వసూతులన్
దునియలఁజేసి కేతనముఁ ♦ ద్రుంచిన నీవు జుణిఁగి పందవై
యనినొక యోరఁడాఁగు సమ ♦ యంబున నీదరిఁజేరి యింటికిన్
జనుమని బోఁచినాఁడ నది ♦ నాయెడ నివ్విధిఁ గీడు మూడెఁబో.

హా! దుశ్శాసనా! నినుఁజంపినవాఁడు కర్ణుఁడుగాని భీముఁడు గాఁడు. చేతికిం జిక్కినాఁడె యా కృతఘ్నునిఁ జంపితినేని నీవు చచ్చియుందువా?

మ॥ నదిపుత్త్రాదిమహారథుల్ వివిధ సే ♦ నానాయకుల్ నన్ను నె
ల్లివముంజేసినఁ గోపభారవహ నక్లే ♦ శంబు నెమ్మోమునం
గదురన్ వారల నీసడించెడి నినుం ♦ గాపాడలేనైతి నా
కిదియేనా కడసారిచూపు విధి నే ♦ నేమందు దుశ్శాసనా.

మ॥ నదిపుత్త్రుండు, ఘటోద్భవుండు, హరుసై ♦ నన్ మీఱు దోస్సార సం
పదచేఁ గ్రొవ్విన వీరులయ్యును సుహృ ♦ ద్వాత్సల్యమేపార నా
కడనంటే బహుభంగులంబొగడు నిన్ ♦ గాపాడలేనైతి నా
కిదియేనా కడసారిచూపు విధి నే ♦ నేమందు దుశ్శాసనా.

మిత్రమా! దుశ్శాసనా! ఇదియే కడసారి కౌగిలి. ఇదియే కడసారి చూపు. (అని లేచి ధనుస్సుఁబూని)

గీ॥ ప్రళయపర్జన్యముక్త ని ♦ ర్ఘాతజాత
సదృశపుంఖానుపుంఖాస్త్ర ♦ సంఘవిదళి
తారి కదళికాషండ సం ♦ హారఖేల
నంబుఁ జూపెద నిష్పాండ ♦ వంబుగాఁగ.

(అని తెరవైపుఁజూచి) ఓ పాండవయోధులారా!

శా॥ వ్రీడం గైకొని డాఁగిరో పఱచిరో ♦ భీతిల్లిరో నేఁడు, పో
రాడంజాలరొ? నేను లేనితఱి ర ♦ క్షాఘంబులందార్చి జ
ల్లాడంగల్గిరె? చక్రి సంతసిలెనే ♦ యాశాస్య మీడేరనే
ఏడీ భీముఁడు వాని తమ్ముఁడు నరుం ♦ డేడీ విలోకింపరో.

(అని నిష్క్రమించును.)

---

## పాండవశిబిరప్రాంతము.

### ప్రవేశము.— కృష్ణార్జునులు.

---

అర్జు:— కృష్ణా! రణరంగముఁ జూడుము. ఎన్నడు లేని సంక్షోభము నే డుండుటకుం గారణము దుస్ససేనుఁడు వధింపఁబడుటయే. అహో! ఎంతభయంకరముగ నున్నది.

మ॥ ఫణిరాడ్గ్రీవవిలోచనానలశిఖా ♦ ప్రద్యోతమై ఘూర్ణమో
ల్బణకూపారసదృక్షమై ప్రళయవే ♦ ళాలోలభూగోళమై
గుణరావాన్వితరోదసీకుహరమై ♦ కోలాహలోద్వేలమై
రణభూభాగముఁ జెప్పనొప్పెఁగడు గ ♦ ర్జత్పుష్కలావర్తమై.

కృష్ణ:—కర్ణుని యాటోపమే యీకోలాహలంబునకుఁ గారణము. ఆకసము కనంబడకుండఁ జేయునవి కర్ణుని బాణంబులే సుమా?

గీ॥ కుండలీకృతచండ కో ♦ దండ కాండ
ముగ్వినిర్గత శరగణం ♦ బులను సైఁ
భూధవమహోమహోగ్రాగ్ని ♦ పొలుపు సెడఁగ
సేయుచుండెఁ గర్ణుండు వి ♦ జృంభణమున.

అర్జు:—అన్నగారి సేమంబరయుటకుమున్నె కర్ణుని పెంపణంచుటయే కర్తవ్యంబని నాకుఁ దోచుచున్నది.

కృష్ణ:—అట్లొనర్చుటయు లెస్సయే. కర్ణుని యునికిఁ గనుంగొనుము.

అర్జు:—(నలుదిక్కులుఁజూచి) ఆహాహా! కృష్ణా! చూచితివా కర్ణుని భీకరాకారము. భయముగొలుపుచుండెడి.

మ॥ పరిశయాగ్రోదయాకాలమై వెలుఁగునే ♦ తద్విద్వంద్వమాస్యంబు పరి
జ్వలితంబై బహు భీకరంబయి యహా ♦ చ్ఛంకై పరికాశించె, దృ
ష్టులు బాణంబులుమూక నొక్కొతటిఁ దో ♦ డ్తోఁ దాకుఁ; నారౌర! నా
తలమా చూచి వచింప నంగవిభుదు ♦ ర్ధర్ష పరితాపోన్నతిన్.

అహహా! కృష్ణా! అయ్యది ముఖమండలమా? లేక యగ్నికుండమా? ఔర! చూచివర్ణింప వేయికనులు చాలివచ్చునా?

సీ॥ ఆతపపరిస్ఫూర్తి ♦ తాఖిలక్ష్మానర
మధ్యాహ్న మార్తాండ ♦ మండలంబొ

అర్జు:—కృష్ణా! ఏమనుచుంటివి? కర్ణునిని విఖ్యాతమహా ప్రచ ఘనముసుమ్మనియా? అయ్యది నాకు ఘనముగాదు. కర్ణుఁ డనిన నాకొక లక్ష్యమా?

గీ॥ విజయనామాంకితుండను ♦ విబుధవినుత
సత్వముంగల వీరుండ ♦ సవ్యసాచి
నరిన్నృపాల కర్ణజ్వర ♦ మైన దేవ
దత్తమున్వీనఁ గర్ణుఁడెం ♦ తటి ఘనుండొ?

కృష్ణ:—అర్జునా! అన్న నేవంబరసివచ్చి పోరాడెదనని యంటివే. అప్పుడీకర్ణుఁ డేమగును?

అర్జు:—భగ్గున మండుచున్నయగ్ని కాలక్రమమున శిశిరస్వభావముఁ జెందకుండునా?

కృష్ణ:—అట్లనా? సరియే. మీ యన్నను గాంచివచ్చి పోరుటయు లాభకరమే! నీ యభిప్రాయముతో నేకీభవించితిని. రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)



# విజయవిజయము.

## పంచమాంకము.

—o—

### ధర్మరాజుర శిబిరము.

విచారముతో ధర్మరాజు ప్రవేశించును.

———— ——— —— .

ధర్మ:—నే ననుకొనినట్లయినది. ద్రోణభీష్మాదివీరుల భయము నాకించుకంతయు లేకున్నఁ గర్ణుని భయమొండు నన్ను బాధింపుచుండెడిది. వనవాసంబుననుండు కాలంబంతయుఁ గర్ణభీతిచే నిద్రాహారంబులు లేక కృశింపుచుండెడి వాఁడ. కురుసేనాంగవనప్రవేశంబునఁ గౌరవశార్దూలంబులం బరిమార్పఁదలంచు మాకుఁ గర్ణాహార్యత మొనరగుచున్నది. కర్ణుఁడు నాకొనర్చు నవమానముమఱచెదనన్న మఱపునకు రాకున్నది. జయము సంశయము. కీడు నిశ్చయము.

మ॥ శిలం బింతయు లేక కర్ణుఁడు సదు ♦ ద్యోగంబు నందుంటచే
సెవిజీవ గెల్చుట చాలదుస్తరము శ్రీ ♦ కృష్ణుండు మా పార్థునిన్
గదనక్షోణిని బ్రోవఁగాఁ గలఁడె? కిం ♦ కర్తవ్యతాసంశయా
ప్లవచిత్తంబునఁ దల్లడిల్లెదను నా ♦ ప్రారబ్ధ మెట్లున్నదో

కర్ణుండు సైన్యాధిపత్యము వహించునప్పటినుండియు నా చిత్తక్షోభ మింతింతయని వచింపఁజనదు. మీఁదు విచారింపక యుక్తకార్యభారము వహించితి.

చం॥ చులకనఁజేసి కౌరవుల ♦ చొప్పు నెఱుంగఁగలేక పేలవై
తలఁచితిఁగ్రూరకౌరవుల ♦ తంబునుయుద్ధమునన్ వధింపనా
కలనివెయద్ది! వట్టివుడి ♦ యాసయటంచు నెఱింగితిన్ సుప
ర్వులకునజేయులైనకురు ♦ భూపతులన్ బరిమార్ప శక్యమే?

మున్నిట్టిపాటుపాటిలునని విచారించియున్న సౌఖ్యముగ వనమునం దకాలంబు పుచ్చియుందుము. ఇపుడిట్లు విచారించుట జనులు నైజమేగదా?

గీ॥ స్వీయబలసాహసంబుల ♦ విశ్వసించి
శత్రువులుస్వల్పులని యెంచి ♦ సమరకార్య
భారమువహించిపోరాడి ♦ బాధలొంది
కందుటది నైజమర్త్యులౌ ♦ కంబునందు.



సేవ:— ( ప్రవేశించి ) జయము. జయము. మహారాజా? వాకిటఁగృష్ణార్జునులు వేచియున్నారు.

ధర్మ—: సత్వరమే వారలఁబ్రవేశపెట్టుము.

సేవ:— రాజాజ్ఞ ( అని సేవ ॥ నిష్క్రమించును )

ధర్మ:— కృష్ణార్జునులు కర్ణునిఁబరిమార్చి యుందురని తోచుచున్నది. అంతటియదృష్టము నాకుఁజేకూరునా? శ్రీకృష్ణుండు మాయండనుండ నంతటియదృష్ట మేలవాటిల్లకుండును. ............ ఏమినామహాత్మ్యము.

గీ॥ కర్ణునిబలంబువిక్రమ ♦ క్రమమెఱింగి
యున్నమదివానివధవిన ♦ నుత్సహించుఁ

దనదుబలహీనత నెఱుంగఁ ♦ దలఁపదయ్యె
వాఁ డయసునదిబుద్ధిజా ♦ డ్యంబుగాదె

ఇంతియగాక, యితరసహాయ మపేక్షించి యుద్ధభారమువహిం
చినమాకు నష్టంబుదక్క లాభమెట్లుండును.

గీ॥ కృష్ణుఁడున్నాఁడుమున్న!మా ♦ కేమిహాని
యనుచుఁదలఁచితినైరంబు ♦ నల్పముగను
తలఁపఁదాకయుండిననేమి ♦ తెలియదన్నెడి
యార్యవచనంబుసార్థక ♦ మయ్యెనేఁడు.

కృష్ణార్జునులు (ప్రవేశించి) కౌరవసామ్రాజ్యలక్ష్మీ ధురం
ధరునకు జయంబగుఁగాక.

ధర్మ:— (సంతోషముతో, వారలనెమున్ గాని)

గీ॥ కూరకౌరవలోకసం ♦ హారకార్య
భారమువహించుమీరలు ♦ భండనమునఁ
గర్ణునింజంపినారె! ని ♦ క్కంబుఁదెలిపి
క్లేశముదొలంగనన్ఁగాంగి ♦ లింపుఁడిపుడు

కృష్ణ:— (తనలో) కర్ణుఁడువధింపఁబడెనని యీతనియభిప్రా
యము. (ప్రకాశముగ) రాజా! కర్ణుఁడే చచ్చెననిచెప్పనేల!
ఏనాఁడుమీపైఁ జెలరేగెనో యానాఁడే కౌరవులెల్లఱుఁ జచ్చి
రని యనుకొనుము.

అర్జు:— (తలవంచుకొనియుండును)

ధర్మ:— కృష్ణా కర్ణుఁడొనర్చిన యవమానము మఱచెదనన్న మఱపునకు రాకున్నది.

కృష్ణ:— ఏమీ! ఆమూర్ఖుఁడంతటియవమానమొనర్చెనా?

ధర్మ:— ఒనర్చెనాయని ప్రశ్నించుచుంటివా! ఏమనిచెప్పవాఁడ!

చం॥ సకలకునైనదుర్భరము ◆ సూతతనూభవుఁడుగ్రింప నమ్మునీ
పకటికితనంపు డెందమున ◆ భీతిలుచుంటిని పెంపుఁదక్కఁ, నన్
దురమునఁ గ్రూరభల్లముల ◆ దుమ్ములుచిల్లులువోవనేసె, శ్రీ
హరిని పదంబులాన నిజ ◆ మాడెదఁ గల్లనచింప శ్రీహరీ.

అర్జు:— ( విచారముతో ) నేబ్రదికియుండియు మీకుఁగష్టంబుఁ జేకూర్చితి. కర్ణునిఁదాకఁబోవుతఱిఁ గర్ణ కఠోరంబగు నీఘోరవార్త విని మీ సేమంబరయవచ్చితి.

ధర్మ:— ఛీ! ఛీ! అర్జునా! కర్ణునిఁబరిమార్పకుండ నా సేమం బరయవచ్చితివా! కర్ణునిఁజంపనీతరమౌనా! మున్నె మనలనందఱ నాతఁడోడించె. క్షత్రియుండవైయుండియు వైరినిర్జించుటయో ప్రాణంబుల విసర్జించుటయో యొకట్టిగాని సిగ్గులేక నన్నుఁజూడవచ్చితివేమి? అట్లయినఁ గర్ణునిఁ జంపుకార్యభారము నేనవహించెద.

చ॥ అలమునఁ దాఁ గర్ణునిట్టి ◆ తాన్నలయావధియించుమూఁడొ
రౌ లయకాలరుద్రినయ ◆ నాగ్నికణంబులభాతి, మృత్యుతం
త్రౌ్రవిధంబుభీకరమౌ ◆ దస్త్రివరంపరఁగుమ్మరించి, యా
కౌఁడనైనధించెదను ◆ కర్ణ సంతోషన చౌకంబుల

( తెర పైపడును )

మ॥ ఏదసంతోషము బూనవేమి ! భయ మేలే ♦ ద్రౌపదీ ! యర్జునుం
డెదిరిఁ గెల్చుట చాలదుస్తరము? శ్రీ ♦ కృష్ణుండు చక్రింబునన్
గదనంబుఁ బొనరింపనేల ! వినునీ ♦ కష్టంబుగట్టెక్కనే
డిదె జృంభించెద సూతజాదిరిపులన్ ♦ హింసించెదన్ ద్రుంచెదన్

గాండీవగదాదండచక్రంబుల విశ్వసించి తెచ్చుకొన్నది చాలు. పరులతో నేమి ! ( అని పార్థకృష్ణభీములనుద్దేశించి )

శా॥ గాండీవంబాకకేల నేలనర ♦ చక్రంబేల కృష్ణా ! గదా
దండం బేటికి భీమ ! కౌరవతతిఁ ♦ దర్పాంధమత్తారినోః
కండూకాండవిశేషసంగతభుజా ♦ కాండవ్యయాలంకృతో
ద్దండాఖండధనుర్విముక్తశరసం ♦ తానంబులం ద్రుంచెదఁ

కృష్ణ:— రాజా ! మేమిచ్చటికి వచ్చుట నీసేమంబరయుకలంపుగానిమఱియొండుగాదు. నీవిట్లు కోపించిన లాభముండునా!

గీ॥ శౌర్యమునఁ దత్తరిల్లిన ♦ గార్యమగునె !
నకలయాకుకలయాకర్త ♦ నుకలసంప !
వేల్మిడింజంపఁదరమెయా ♦ వీనరుని
నోర్మిపహియింపవలెఁగాక ♦ ధర్మరాజ.

ఇంతియకాక కష్టనింజపుటకుఁగృష్ణాస్త్రములు చాలునన్నికరుఁడె వ్వఁడుసమర్థుండగును!

ధర్మ:— అట్లయినచేసికష్టమొందలకు !

చ॥ ఆలమొనర్చెదన్ విజయ ♦ మంచెదనఁచూపచించుఁగి[illegible]! పాం
[illegible]కపలుకతో[illegible] ♦ మానమతోఁబనియే[illegible]

చాలునురాజ్యకాంక్షకడు ♦ సంతసమొందెదలేకయున్న ? ని
ర్మూలముగాకయున్నె కుల ♦ మున్ బలమున్ గలవీరులెల్లబున్

అర్జు—అన్నయ్యా! తప్పులన్నియు సైరింపుము. కాలముంబట్టి గదా కార్యములు చక్కఁబడును. భీతిలి డాఁగుటకు వచ్చితి నని నీవు తలంపకుము.

ధర్మ:—అర్జునా! ఎందులకీ ప్రగల్భములు?

గీ॥ ద్రోణుఁడో భీష్ముఁడో సు ♦ శేందుఁడో సైంధ
వుండొ భక్తవత్సలుఁడో? క ♦ ర్ణుఁడొ దేవుండు
కురునృపాలుని ప్రాణస ♦ ఖుండతండు
కృష్ణ సాహాయ్యమున్న ని ♦ ర్జింపఁగలవె?

కృష్ణ:—కర్ణుఁ డెట్టివాఁడైనఁ జావకుండునా! నీవధైర్యము బూనినందులకు మేమేమిచేయఁగలము.

ధర్మ:—కృష్ణా! ఇంతధైర్యము వహించుటకు వహింపకుండుట కునేమున్నది. కర్ణుఁడువధింపఁబడెనేని రాజ్యమువచ్చునులే నిచోఁగానలకేగెదము. ఇంతకునితరులనేల దూషింపవలయు.

మ॥ మనునేఁజేసిన కర్మకుం దగుఫలం ♦ బున్ దక్క నన్యంబుఁ గో
రినఁ జేకూరునె ! పండ్రై నరుఁడు సై ♦ రిం జంపలేకున్నచో
ననఘా ! కానలు లేవొకో ; విధిబ ♦ లీయంబన్న లోకోక్తియం
దఁ బ్రతంబుండునె ? మాకు నీదగు సహా ♦ యంబున్నలేకుండినన్

కృష్ణ:—( రహస్యముగ ధర్మరాజుతో ) అర్జునుఁడుఖిన్నుఁడై చింతిలుచున్నాడు, వానికిధైర్యముఁగఁబలుకకున్నఁగార్య

విసుమించును. ఇపుడైన శాంతింపుము.

అర్జు:— అన్నయా! త్రిమూర్తులుఁ బోరవచ్చిన నభీతి లేనువాఁ
డఁగానని యెఱింగియు నిట్లు పలుకం జెల్లునే!

చ॥ చేతమునందు వాకక్కలను ♦ చెయ్యాలఁ బోరితమన్న నెట్టికో
భీతి యొఱుంగఁ బాపమను ♦ భీతి యుఁదక్క! విశేషరోషసం
భూతపుతూహలంబునను ♦ పోరి శచీపతి మెప్పుఁ జెందియూ
శీతనగాత్మజాధవుని ♦ చేవరమున్ శరమున్ గ్రహించితిన్

( యింతియగాక )

చ॥ సురపతిఁ దోలి యొక్కరుఁడ ♦ శూరత ఖాండవమున్ దహించితిన్
గరువలి విందొసంగిన ఘ ♦ నంబగు గాండివమున్ వహించితిన్
గెరలి సురాపగాతనయు ♦ గెల్చిపటోద్యమ నొర్చి మించితిన్
ధరఁగల రాచజోదులను ♦ దంబున పంచితిఁ గీర్తి గాంచితిన్

అసహాయశూరుండగు నర్జునునకుఁ గర్ణుండన్న నొకలక్ష్యంబు
గాను. కాలముఁ జూచి కర్ణుని నిఁదాకెద. శాంతింపుము.

ధర్మ:— అన్నియుఁ గావించితివి. కార్యమేమి! కర్ణునిమాత్రము
చంపలేకుంటివి.

కృష్ణు:— రాజా! అంద ఱిఁజంపుట పూ! కర్ణునిఁ జంపుట, తాలి
మిఁ బూనియుండుము,

ధర్మ:— తాలిమిఁ బూని చాలకాలమైనది. నీ సహాయ ముండి
యు లాభము లేకపోయినది.

కృష్ణ:— అర్జునునకు నాసహాయమున్ననేమి లేకున్ననేమి!

సీ॥ కాలకేయాదిరా ◆ క్షసులతోఁబోరాడి
కూల్చినాఁడీతఁడో ◆ కుఱ్ఱఁడుగాఁడె
శస్త్రాస్త్రములఁదాల్చి ◆ సంసప్తకులఁదాకి
కసిమసంగెనితఁడో ◆ కుఱ్ఱఁడుగాఁడె
మించి భర్గుని మోహ ◆ రించిపాశుపతాఖ్య
కాండంబుఁగొనియెనో ◆ కుఱ్ఱఁడుగాఁడె
అంగారపర్ణుని ◆ సంగరస్థలిఁబెట్టి
పరిభవించెనితఁడో ◆ కుఱ్ఱఁడుగాఁడె
గీ॥ నరుఁడువైరిచమూహారి ◆ హరుఁడువిజిత
హరుఁడుగాండీవ ◆ కార్ముకధరుఁడువర
రః కిరీటవిరాజచ్ఛ ◆ రణుఁడుఘనుఁడు
కర్ణుఁడనినఁగిర్ణుఁడ ననల ◆ క్ష్యంబెచెప్పుమ

అర్జు:— అన్నయా! గతించినదానికి విచారించిన లాభమేము
న్నది నీసేమంబరయ చ్చుటమ్మ శీఘ్రముగఁబనుపుము
అటుపైనీవెట్టివార్త వినెదవోనేఁజెప్పనేల!

చం॥ పులిఁగనిపాఱుజింకలన ◆ భూపతులెల్లఱువిచ్చిపాఱను
జ్జ్వలతరతీవ్రబాణముల ◆ వైరులనెల్లఁదుంచియాశవం
బులమృగయూథపక్షికుల ◆ ములతినుచుండఁగఁజూచియేచినా
బలముసుమీకుఁదెల్పఁగనువచ్చెద ◆ నిచ్చెదభూరిరాజ్యముల్

కృష్ణు:— అందులకుసందియంబొందుండునా!

చ॥ రాజు, సుధీజనాజ్ఞనిన ◆ రాజుఁగృపారసపూరితాననాం
భోజు, నిజాశ్రితాళిసుర ◆ భూజు,ద్విణీకృతశతృహివానీ

రాజు, ముఖపరికాళజిత ♦ రాజుఁగృతాంతతనూజు, విస్ఫుర

త్తేజు, వధింపగాఁదలఁచు ♦ ధీరునిఁగ్రీడివధింపకుండునే

ధర్మ:— (తనలో) (ఇఁకశాంతించెదంగాక(ప్రకాశముగ)

కృష్ణా:—! ఆపద్బాంధవా!

ఉ॥ సారససంభవాచ్యుతప్ర ♦ షధ్వజజిష్ణుకృతాంతులైనను

న్బోరితమందుగర్ణుఁబిఱుఁ ♦ దొవకమార్గాన తేరుదైత్యసం

హారుఁడవీవటంచుమది ♦ నారసితమ్మునిఁబంపుచుంటినీ

భారముచూపెపార్థునకు ♦ బాసటవై విజయంబుఁగూర్పవిూ

కృష్ణ:— రాజా! నీవునొక్కిచెప్పవలెనా! నాసహాయముతో

నేమున్నది. నీధర్మమే, నిన్నురక్షింపఁగలదు.

చ॥ అక్రమరాజలోకమహ ♦ హాయన, దిక్కులుసంచలింప, భూ

చక్రముతల్లడిల్లఁగురు ♦ చక్రముభీతిలివెన్నుసూప, దో

ర్విక్రమకేళిలోనఁబృధి ♦ వీధరవైరి తనూభవుండుని

ర్వక్రతవైరులన్దునిమి ♦ వచ్చునుధర్మమెయూతకోలగాన్

ధర్మ:— (సంతోషముతో) అర్జునా! మున్ను నీవుచూపినవిక్ర

మము నంస్తవనీయముగానేరదు. కర్ణునిఁదునుమునవే నీశౌ

ర్యాదేమెప్పుఁజెందిననీకీర్తికిమెఱుంగగును.

సీ॥ జంభారిచేఁబూను ♦ దంభోళినింబోలి

రిపుపర్వతములహ ♦ రింపవలయు

సప్తార్చిలీషతే ♦ జంబునువెలిబుచ్చి

మార్తురన్ మాత్రికులన్ ♦ మాడ్చవలయు
నతిభీకరంబైన ♦ యమునిదండముభంగి
శత్రుపాపాత్ములం ♦ జంపవలయు
మధ్యాహ్న భీషణ ♦ మార్తాండునిం బోలి
కురురాజు తేజంబుం ♦ గూల్పవలయు
గీ॥ గెలుపులిచ్చినఁజేఁబట్టి ♦ కేరలవలయు, గినిసిపరచమూలోకమున్
దునుమవలయు మించినాఁడుభూతేశు ♦ మెప్పించినట్టిచాపజ్ఞో
పప్రతాపముల్ చూపవలయు

అర్జు:— అన్నయా! యికవిళంబమెందులకు.

మ॥ కరయుగ్మంబునఁగాలిలుగూతనంతువిల్ ♦ ఖండించిగాండీవని
ష్ఠురచాపప్రవిముక్తభీకరశర ♦ స్తోమంబులన్, నాదుమ
చ్చరమున్ దేటపడన్ విపచ్ఛరులుమె ♦ చ్చన్ బైకిలంఘించిత
చ్ఛిరమున్ పక్రికలఁజేసివచ్ఛేదభవ ♦ చ్చిత్తంబుపొంగారగన్

ధర్మ:— అర్జునా! ఈకార్యమునీకలంతియనినెఱుంగుదుము.
అందులకుసందియములేదు

గీ॥ పశుపతినిగెల్చిప్రతిభమై ♦ పాశుపతము,
నెన్నువెన్నాసయుంగొన్న ♦ విజయ! నీవు
తకళపాలాత్ముండైనను ♦ తజునిఁదునుమఁ
గలఁడే! నీకింకవిజయంబు ♦ గాకయున్నె

కృష్ణా! యుద్ధంబునకునేఁగడంగుటకుఁ గారణమీవె
యెఱుంగుదువు.

చ॥ సంధిమొనర్ప నెంచినిను ♦ శాంతమనంబునఁ బంపినాఁడఁగ
ర్వాంధులు కౌరవాధములు ♦ హానిఘటింపఁదలంచి మించిఁయీ
రంధ్రిని బెట్టిచాలక ♦ పరాభవమున్ దగఁ జేసిరో జగ
ద్బాంధవ! నీకతంబునఁగ ♦ దాయలదాయల మోహరించితిన్

పాండవాభిమానముంగల నీకధికము చెప్పనవసరము లేదు. అట్లయ్యు నీచిన్నవిన్నమాలకించి ననుఁగృతార్థునిఁ జేయుము.

చ॥ సంజయరాయబారపుఁబ్రి ♦ సంగము సర్వము నీ సమక్షమం
దుంజరిగెంగదా! రిపుల ♦ తోడఁ బెనంగొన నెంచి యాప్తులన్
భంజనమున్ బొనర్పఁ జల ♦ పట్టితి నాపయి నీకుఁ గూర్మి యుక్త
రంజన లేక పోయినని ♦ రంజన! యయ్యది నాయ భాగ్యమే

కృష్ణు:— (ధర్మరాజు హస్తంబుల రెంటిఁ బట్టి) మహానుభావా! నన్నుం గరుణింపుము. తప్పులు నాయవిగా భావింపుము. నీకుఁ దప్పక మేలు చేకూరఁగలదు. మాకాజ్ఞ నొసంగుము. అర్జునా. పోవుదము రమ్ము.

అర్జు:— అన్నయా! నీ వాక్యములమోఘంబులగుఁగాక.

( కృష్ణార్జునులు నిష్క్రమింతురు. )

ధర్మ:— నాయదృష్టమెట్లున్నదో యట్లగును. కృష్ణుండు గలండు గదా యను ధైర్యమొందుఁ గలను. ఇందులకుఁ దోడు భూసుర శాపమొందఁగలదు! కష్టంబుచచ్చుననాసయుఁ గలను.

చం॥ అలజడిఁ జెందినన్ కిరీటి;జ ◆ యాపజయంబుల నిర్ణయింపనా
కలవియొ? నాదుడెందమడి ◆ యాసఁ బెనంగుచునుండెఁ గీడువా
టిలునో? యెవండెఱుంగుమును ◆ డీకొని పోరుట రాచపాడి? త
త్ఫలితము నిశ్చయింపగల ◆ భారమదృష్టముఁ బూనియుండు బో

అయిననీవిషయమిట్లునిశ్చయింపవచ్చు.

గీ॥ దుస్ససేనుని భీముండు ◆ దుంచుకతన
భూసురుని శాపకారణం ◆ బునను మఱియు
ననుచితంబులఁ బలుకు ◆ శల్యునికతంబు
కర్ణునుత్సాహమింకఁద ◆ త్కలనఁ జచ్చె

(అని ధర్మరాజు నిష్క్రమించును.)



## —: పంచమాంకము. :—

### రంగము:— కురుక్షేత్రము.

ధృష్టద్యు:— ( అధికసంరంభమునఁబ్రవేశించి )

గీ॥ శింజినీనినాదంబున ♦ జెవుడుపఱచి
కఠినభల్లంబులను మేన ♦ గదియఁగుచ్చి
బెగడియెచ్చోటడాగెను ♦ భీముఁడనుచు
జెండుచున్నాడుకర్ణుఁడు ♦ జెలగినేడు

కృష్ణుఁ డెంతటిచమత్కారముఁ జూపించెను. పోరిపోరియర్జునుండలసియుండుటచేఁ గర్ణుఁడాకనన్నుఁ బురికొలిపి రథముఁ దోలంగించెను. ఇఁకకర్ణుని పరాక్రమముఁ జూచియానందింపవలసినదే.

మ॥ అహహాకాంచినసెట్టివారికిభయం ♦ బౌగా,ధనుర్జ్యాముహు
ర్ముహురుద్ధూతశరప్రకాండములరు ♦ ద్రింబోలిచెండాడుచున్
విహరించెన్రిపుభీకరుండయిరణ ♦ ప్రేంఖజ్జయశ్రీకర
గ్రహణాశక్తిని; సూతపుత్రుఁడుమహా ♦ కాలుండుతథ్యంబుగన్,

ఆసూాక్షుండువచించిన పలుకులు వానిములుకులకన్న నెక్కుడుగబాధింపుచున్నవి.

క॥ పగసాధింపఁగలంచియావహమెు ♦ నర్పుంజాలమిఁగానన్ను నిక్
దగులంజేసితొలంగినర్జునుఁడుదై ♦ త్యఘ్నంసియుక్తిఁ, నీను మే
లగుఁబో! సూతుఁడు రాచబిడ్డఁడని నే ♦ నన్నెట్లు శిక్షింబ నీ
భగినింగూర్చివచింపుమీవనుచు సం ♦ భాషించె నీర్వ్యాళుఁడై

కర్ణునితోఁ బోరఁదగువీరుఁడైనఁ గనుపడకుండె. ఇఁక యుద్ధము తోనేమిలాభము. ( అని తెరవైపుఁజూచి )

చం॥ పరిశయము సంఘటిల్లెను గ ♦ రాజతనూభవ! మృత్యుసర్పదం
ష్ట్రిలఁ బలెనుండె భల్లనిక ♦ రంబులు పావని! శూలిశూలధా
రలపోలుపొందెఁ జూడికియమ ♦ రాజతనూభవ! ప్రాణముండిన న్
గలిమియునుండు బాయుఁడిఁక ♦ కర్ణుఁడు రుద్రుఁడో వీరభద్రుఁడో

( కర్ణుఁడాకస్మికముగఁ బ్రవేశించి విల్లెక్కువెట్టి )

( దృష్టద్యుమ్నుఁగాంచి )

చ॥ పఱచెదవేని బాణమునఁ ♦ బ్రాణముఁ గొందు దురాత్మ! నీదుసో
దరి మగఁడెవఁడో పునుఁదారొకనిఁ జాలునె ♦ శూలిరైన శ్రీ
ధరుని స్మరించుకొ్రపదివి ♦ ధరంబు స్మరింపుము బోంచు నేమొ! భూ
సురులవధించితప్పిగను ♦ శూరుఁడు ధీరుఁడో లేక భీరుఁడో

దృష్ట:— పరుగిడిపోవుటనుఁ బంవననుకొంటివా యేమి! రాచకొ లంబునజనించిన రాచబిడ్డనుగాని సూతుఁడఁగాను.

కర్ణ:— ఓయీ! ఈపలుకునీ సోదరినేర్పెనా యేమి! ఈబింకము లఁబలుకుట మానైజముగాఁబోలు. నాడునీసోదరియునిట్టిబింక

కుఁగలభయ మేమి. తొలుత నేనిశ్చయించు తలంపునకు వ్యతిరేక ముండునా?

ఉ॥ ప్రాణము పైని రాశ యిడి ♦ భండనమున్ బొనరించి సైనిక
 శ్రేణి మొనర్చ దక్షరిపుల ♦ దర్పమడంచెద, వచ్చుఁ గాక క్షో
 ణీసమేతులై యనికి ♦ గాలియుఁ గీలియు నంశుమాలియుం
 శూలము లై చెలంగ, వస ♦ మాలియు శూలియుఁ దమ్మిచూలియున్

ఆయంశ మటుండ, నేడు శ్రీకృష్ణుఁడు కిరీటినాతోఁ బోరి పోరి యలసి యుండుటం గాంచి, రథముఁ దొలంగించి దృష్టద్యుమ్నుని నన్ను మార్కొనఁ జేసెను. ఈ బడుగా నన్నంకిలి సేయునది నే నలసి యుండుతఱిఁ గాంచి, కృష్ణుఁ డర్జునునిఁ బురికొల్పక తంబున జయము సంశయముగ నున్నది. ఊ! ఇందుల కేమి, మాకు జయము చేకూరఁ గలదని నేఁ దలంచితినా యేమి?

చం॥ ఎఱుఁగుదుఁ బాండునందనుల ♦ హీనపరాక్రమము, లైకమత్యము
 దొలఁగలని జోదులందులకుఁ ♦ బోడుసహాయముఁ జేయుఁ గృష్ణుఁడున్
 గురుబలమైక మత్యము న ♦ కుంఠితసత్త్వ గుణంబులా సమ
 చ్ఛరమున హీనుసకృటలన ♦ దైన్యవినాశన మెంచ దెన్నడున్

అర్జునుం డెచ్చట నున్నదియుఁ దెలియకున్నది. ఎవరెట్లున్నను నాకేమి? నేఁ బోరెదం గాక, ( అని తెరవైపుఁ జూచి ) ఓ పాండవవీరులారా!

శా॥ చూడంజాలడొ నాదుపోటుఁగనమున్ ♦ శూరత్వ మందక్కఁపో?
రాడంజాలడొ? పంగువో బధిరుఁడో ♦ యంధుండొ, ద్యోవాహినీ
చూడామోఘపవిత్రపాశుపతమె ♦ చోచ్చెఁజిక్కెనో నుఱ్ఱికెనో;
ఏడీయామగరాచబిడ్డఁడునరుం ♦ డేచాయఁబోంచుండెనో?

— (అనికర్ణుఁడు నిష్క్రమించును.) —

స్థలము. కురుక్షేత్రప్రాంతము, కృష్ణార్జునులప్రవేశము.

అర్జు:— కృష్ణా! దేవతలకరుణాకటాక్ష విశేషంబున నార్జించిన యస్త్రంబులన్నియుఁ గర్ణునిచేనిర్జింపఁబడినవిఁగదా! అక్షయతూణీరుండనగు నేన యింత బెండువడుచుండ వేరొక్కయుక్కలుం డీకర్ణునిముందు నిలువఁగలఁడా? భుజవిక్రమముక్రమక్రమముగ క్షీణింపుచున్నది. ఆతఁడోయించుకయుఁ గందఁడు.

చ॥ చెదరడు చెక్కుటద్దెమట ♦ బిందువులూరవు తూపువేసినన్
జెదరదు వాఁడిమింగలుగు ♦ చిల్కులు నాటిన వేడియూర్పులన్
జొదలుడు, తూణమందుగల ♦ ములుకుల, గైకొను వేళనైననుం
గదలడు? మేలు మేలవుర! ♦ కర్ణునివిక్రమమింత యొప్పునే

కృష్ణు:— అర్జునా! దీనికై యింతవిచారింపనేల? సంరంభముడిగి శాంతుండవై యుద్ధమొనర్పుము.

అర్జు:— కృష్ణా! ఈయవమానమెట్లుసహింపవచ్చు.

దేవేంద్రదత్తమైనకిరీటము తెల్లఁబడిపోఁగదా

కృష్ణ:— అందులకు విచారింపనేల? శల్యుని ధర్మమాయనిబ్రదికినందులకు సంతసింపుము.

అర్జు:— ఆయోరమనమున్నట్లు కర్ణుఁడెట్లుగ్రహించెను.

కృష్ణ:— చారులవలననెఱింగిమనల దార్క్యనియెను.

అర్జు:— దార్క్యనెఁబో. మగుడరథముఁదోలంగించి పాఱివచ్చుటకీర్తికిఁగళంకముకాదా!

కృష్ణ:— అర్జునా! రణమర్యాదలవిధమునీవెఱుంగవా?

ఉ॥ క్రొల్పులిపోలికిన్ మైమఱచి ♦ రోసము పెంపున వైరియుద్ధముల్
సల్పుతఱిన్ దొలంగఁదగు ♦ ఁజాలశుభంబగు; లేకయున్న సం
కల్పము సిద్ధిఁజెందునె? న ♦ గంబులుబీటలువాఱిబ్రద్దలౌ
పోల్పునపెట్టఁగ్రాలెడిన ♦ భోమణిబారికిసగ్గమాదు లే?

(అంతధృష్టద్యుమ్నుఁడధికసంరంభమునఁబ్రవేశించి)జయము జయము,కృష్ణా! జగద్బాంధవా!

కృష్ణ:— (తనలో) ముఖవైఖరిఁజూడనుల్లాసముఁగన్పట్టెడి.
(ప్రకాశము) పాండవసేనాధిపతివచ్చు కార్యమెట్టిదియో

అర్జు:— (తనలో) ఇతఁడుకర్ణునకుభీతిలివచ్చునట్లుదోచెడి.

కృష్ణ:— ఏమని చెప్పఁదగు. మనకుశుభకాలము సంప్రాప్తమైనది.

గీ॥ అడుసుమిక్కిలిపెంపొందు ♦ మడుగునందు
మదగజంబుతగుల్వడు ♦ మాడ్కినహహ
భూసురుని శాపకారణం ♦ బునను త్రుంగె
సంగరస్థలిఁ గర్ణుని ♦ స్యందనంబు

కృష్ణు:— అట్లయినచో నీశుభవర్తమానము పాండవాగ్రజునకుఁ దెలిపియుత్సాహముగొలుపందగు.

ధృష్ట:— అయ్యది త్రుటికాలములో జరుగఁగలదు. ( అని నిష్క్రమించు )

అర్జు:— కృష్ణా! సంకల్పసిద్ధుండవు.

కృష్ణు:— నీవుజయేందిరను బెండ్లాడుటకుసిద్ధముగనుండుము.

(ఆటోపమునశల్యునితోఁగర్ణుఁడు ప్రవేశించి) (క్రీడిఁజూచి)

ఉ॥ పాఱితివేలరాహరుని ♦ బల్మినడంచినబంటుమిన్న! వి
స్తారయశోవిశాలురగు ♦ క్షత్రియులెల్లహసింపఁజాపతూ
ణీరములూనిభీతిలిజు ♦ ఱింగితివేమగవాఁడవౌర! దో
స్సారమడంగెనేశరము ♦ చాపముతూణముఁద్రుప్పవట్టెనే

( అనికృష్ణుఁజూచి తిరస్కారముగ ) ఓహో! శ్రీకృష్ణభగవానుఁడా!

సీ॥ ఎవనిప్రతాపాగ్ని ♦ కింధనమ్మైభస్మ
మయ్యెశత్రువులక ♦ స్తారిస్త్రిసమితి

ఎవ్వానిదోశ్శక్తి ♦ పృథ్వీశగళరక్త
ధారలగట్టున ♦ దారివిత్రిచ్చె
నెవ్వానితురగమ ♦ త్తేభభటపదర
జఃపాళినిరుడుసం ♦ ఛన్నుడయ్యె
నెవ్వానిహుంకార ♦ హేరాళరవమున
బ్రహ్మాండభాండంబు ♦ బ్రద్దలయ్యె

గీ॥ నెవనిధాటికిజెగ్గిలి ♦ కృష్ణుడనెడి
యాగవేందురిందు వారాశి ♦ యందుడాగె
నట్టిబలునిజరాసంధు ♦ నణచినట్టి
వీరవరునికర్ణునినమ ♦ స్కారమదియ

( అనినమస్కరించును. )

శల్యు:— కృష్ణా! కర్ణునకునీయందుభక్తియెండు,

కృష్ణు:— అవునవు. అర్జునునిబాణాగ్ని కర్ణునిశుద్ధుజేయుగాక.

అర్జు:- — తథాస్తు.

కర్ణు:—ఓహో! అర్జునా! ఇప్పలుకులకుబ్బిగర్వింపకుము,

చం॥ భవునినిరాకరింపగల ♦ బాహుబలుండితడంచునీతునూ
ద్భవునిధనుస్సుదురింపబలు ♦ పలుకులనెక్కలుపెట్టునాఘుటో.
ద్భవునివధింపజాలనిక ♦ తంబునసేమియుజేయనట్టిసెం
ధవునివధించునీదుబల ♦ దర్పములెవ్వడెఱుంగకుండునో

అర్జు:— ఎవఁడెఱింగిన నెఱుంగకున్న నీ వెఱుంగుదువు.

కృష్ణు:— అందులకుసందియంబేమి?

కర్ణు:— అవునవును. కృష్ణా! నేనెఱుంగుదును. నేనయన నేలలోక
మెఱుంగును.

చం|| తనదుపరాక్రమంబునఁగఁ ♦ డార్కొనఁజాలకజంకిబెగ్గిలన్
గనుఁగొనియుగ్రమూర్తివయి ♦ కైదువుఁబూనిననిన్నుఁబట్టినీ
మనుమఁడఁబోవుమంచుబ్రీతి ♦ మాలి, శిఖండినిమున్నుబెట్టి, శాం
తనువధియించుక్రీడిబల ♦ దర్పము లెవ్వఁ డెఱుంగకుండునో

అర్జు:— ఓరీరాధానందనా! నిన్ను నేగణించువాఁడనా

గీ|| కాలునింబోలువీరుల ♦ కండక్రొవ్వ
ణంచిభువివిక్రమించిపరాక్రి ♦ మించినాఁడ
నాదినారాయణుండుక ♦ న్నావునాకు
రారవధియింతుఁగర్ణనీ ♦ రణముత్రుణము

కర్ణు:— శ్రీకృష్ణుఁడాదినారాయణుండగును. నీవొక వీరుండవగు
దువు:

శా|| నానారాజవితానసేనలకున ♦ న్యాయంబుగాయుద్ధసం
ధానంబున్ బొనరించియందునొకపె ♦ ద్దంజూచికన్ప్రిమిన
వ్వానిందుంచియతండురక్కసియనన్ ♦ వ్యాపింపఁగాఁజేసి, యా
నేనేదేవుఁడనంచుఁజెల్పు ♦ నీకృష్ణుండు శ్రీకృష్ణువే

కృష్ణు:— కర్ణా! ఎందులకీ యక్కజకుగానిపలుకులు,

శల్యు:— కిరీడిములుకులు బుద్ధి చెప్పినంగాని యీపలుకులుక ట్టువడవు.

అర్జు:— సూతకుల సంజాత ! ఈగాండివ మెట్టిదని నీయభిప్రాయము.

కర్ణు:— నీగాండివ మెట్టిదయ్యినా కేమిభయము.

ఉ॥ దండమునుంగమండలము ♦ దాలిచిచోరయతీశ్వరుండవై
కొండలనక్కిచానలత ♦ గుల్కొనిపోవుబొజుంగుమిన్న! యు
ద్దండశరాసనాదిశర ♦ తండములన్ వహియించివచ్చినన్
నిండుమగంటిమిందొలఁగి ♦ నీనుభయంపడనీశ్వరుండనే?

శల్యు:— కర్ణా ! ఎందులకీపలుకులు. రథము క్రుంగెఁగదా! అర్జునునిశరణువేడుము.

కృష్ణు:— శరణమా ? మరణము.

అర్జు:— ప్రోవుమనినఁబ్రోచువార లెవరు!

కర్ణు:— ఓహో ! యేమియీశూరత్వము.

ఉ॥ భీరుఁడగాను నేనురణ ♦ వీరుఁడ, శూరుఁడ, శత్రులోకసం
హారుఁడ, సూరిసజ్జనవి ♦ హారుఁడ, ధీరుఁడ, భూరిభీకరా
కారుఁడ, వైరిభీకరుఁడఁ ♦ గర్ణుఁడ భాస్కరతుల్యవర్ణుఁడన్
ధీరుఁడ వైనవానినను ♦ దింప్రమునింపుముకీర్తిబంధురికల్

— సూతసుతుని వధించుటయొకకష్టమా.

— అబింక మెట్టిదోచూచెదంగాక. శల్యా! రారాజునకుఁ బ్రమఱియొందురథముంగైకొనిరమ్ము.

—అట్లువలనుపడదు.

— ఎందుచేత.

— మఱియొందు రథముఁదెచ్చుటకుఁ గాలమొసంగము

— కారణము.

— భస్మనిమోహరించి మించిన మదీయబాణం బులునీ ప్రాణంబులకుఁదత్తఱిల్లుటయముఖ్యకారణము.

— ఒకరురథముపై. నొకరుక్రింద. ఇయ్యదిరణధర్మమా!

— కర్ణా! ధర్మప్రసంగ మెత్తకుము.

మదమునభీమునింబిలుకు ♦ మార్పఁదలంచుటమీకుధర్మమే
బెదరకద్రౌపదింబరిభ ♦ వింపఁదలంచుటమీకుధర్మమే
పదువురుఁగూడియొక్కపసి ♦ పాపనుజంపుటమీకుధర్మమే
కదనమునందునిర్గవిసి ♦ కంఠముఁద్రుంచుటమాకధర్మమే

— అట్లయిచో మీరుపోరుటనధర్మమే.

—ఏమీ!మారాజ్యమునకై మేముపోరాడుటయధర్మమా!

— కోరివ్వి జూదమాడి రాజ్యమోడిన మీకురాజ్యంబుగావలయునా?

కృష్ణు:—రాజ్యమువీరభోజ్యమనియూహించిపోరాడుచుంటిమి.
కర్ణు:— రాజ్యమువీరభోజ్యమగుఁగాక. కాదనియనువార లెవరు?
మేలుచేయువారికిఁగీడుచేయుట యెచ్చటిధర్మము?
అర్జు—ఔరా! పాపము. కౌరవులుమాకు మేలుచేయుటొకటియా?
కర్ణు:—ఓరీ! కృతఘ్నా! నీవుమరచితివి. చెప్పెదవినుము.

చం॥ తనయరపాలుఁగోలుపడి ♦ తమ్ములభార్యనుఁ బోడె ధర్మనం
దనుఁడలద్యూతమందు; ద్రుప ♦ దక్షితినాథుని బిడ్డకుం దుకా
రణమునఁ బోరి చెన్నత ♦ రాష్ట్రుఁడు దాస్యమునుండి; నమ్రతై
మనుచుఁ గృతజ్ఞులౌటతను ♦ మారుగ బోరుటమీకుఁ బాడియే?

కృష్ణు:— ఓయీ కర్ణా! నేనొకధర్మముఁ జెప్పెదవినుము. కుటి
లచిత్తులగు కౌరవుల వధించుటయు రాచపాడి. నాఁడు ద్రౌపది
ని పరాభవించునప్పుడీ ధర్మమునశించెనే? వైరులనెల్లైన
మారణ మొనర్చుట మారణధర్మము.

గీ॥ జలధరమునుండితొలఁగున ♦ జలంబుఁ బోలి
ధర్మమనునదియతిపవి ♦ త్రంబయగును
అవనిఁబడువర్షధారల ♦ యట్లు, పాప
కర్మలంజేరిధర్మము ♦ ధర్మమయ్యె

అర్జు:— కర్ణా! పాఱిపోవుటకుఁ బ్రయత్నించుచుంటివాయేమి?
కృష్ణు:— అర్జునా! కర్ణునిస్వభావము బాగుగగ్రహించితివి. క

ణ్ణా! ప్రాణము పోయినఁబోవుఁగాక. పరుగిడవలదు. వీరుఁడవ
నినమ్మినీకు సారథినైతిని. నాకుఁదలకొట్టినట్లున్నది.

కర్ణ:— అవును. రాజద్రోహులకుఁదలకొట్టుటయేశిక్ష.
( అనియర్జునుఁజూచి ) ఓరీ! గర్వాంధా! బృహన్నలా!

ఉ॥ స్థాణుని మెప్పుఁ జెందినమ ♦ దంబున మిన్ను నుమన్నుగానవా
స్థాణువవచ్చుఁగాక నిను ♦ సంగర రంగమునందు దీర్ఘని
ద్రాణనిఁ జేతు నా శిత శ ♦ రంబు భయంకర వహ్ని కీలలక్షా
బాణముఁ దూణమున్ బయిని ♦ ప్రాణములన్ దహియించు నేఁతయున్

అర్జు:— ఔరా! ఏరైన నవ్వుదురనెడి సిగ్గైన లేకపోయెఁగదా?

మ॥ హరి మత్సారథియంట, వానరకులా ♦ ద్యక్షుండు డాలంట, సం
గరసంక్రీడలఁ గిరిఁగొంటినట, యీ ♦ గాండీవముం బూని, యీ
శ్వరు మెప్పించిన బల్లిదుండనట, హా ♦ పాపంబు సూతుండునన్
బరిమార్పంగలఁడటట, ధీహీనమా! ♦ పంచాస్యముం గూల్చెడిన్

కర్ణ:— అర్జునా! నీవెంతటి స్వాతిశయముఁగలవాఁడ వయ్యు
ధర్మయుద్ధమున నన్నుఁ జంపజాలవు. కృష్ణుని ప్రేరణమున నీ
వు నన్నధర్మమునఁ జంపుదువుగాక. అయ్యది నీవు నన్ను జయిం
చినట్లు కాదు. ఇంతకు మీరధర్మయుద్ధమునకుఁ బాల్పడి
గ్రహించునది మాయుచ్ఛిష్టముగాని [illegible]

ఉ॥ ఇష్టమువచ్చినట్టిలన ♦ నేకదినంబులు మేముప్రీతిను
త్కృష్టము గాథరాతలము ♦ నేలిసుఖంబులఁ జెందినాము; సం
తుష్టిని మీరుచుట్టముల ♦ తోడను మేము భుజించితో్రియును
చ్ఛిష్టపుఁగూడు మెండుగభు ♦ జింపుదుకృష్ణుఁడుసంతసింపగన్

( తనలో ) ఇఁక మొండిపల్కులతో నేమిఫలము?

ఉ॥ ఎంతటియుద్ధభారమువ ♦ హించెనొ నాదురథంబుక్రుంగె; నా
పంతమణంగెః గౌరవన్ప ♦ పాలునిపెంపుదొలంగె; నాజిప
క్రాంతినిసుక్కెసేన; జయ ♦ కాలము పాండవపక్షమయ్యె; న
త్యంతముఁ జెందెబల్మియు; ని ♦ రాశవహింపుటకింక శంకయే;
గీ॥ సంగరమున నాదురథంబు ♦ క్రుంగునంత
నాగ్రహమణంగె వైరాగ్య ♦ మాసహిల్లె
భారమయ్యెవహింపశ ♦ రీరమెల్ల
చాఁదలంచితినాకేల ♦ జయజిగీష

అట్లని నేనిపుడు వెనుదీయఁజనదు. నావిధి నేనొనర్చెద.

ఉ॥ భవ్యులుపాండునందనులు ♦ పాడియెఱింగినవారు; వారిభాం
ధవ్యము నాకుభావ్యమయి ♦ నక్షకురునాథుని చెల్మికల్మిఁగ
ర్తవ్యము పోరితంబ; సమ ♦ రంబొనరించిపరాక్రమించెదన్
నవ్యయశోవిలాసమున ♦ నాకసుఖాతిశయంబులందెదన్

( ప్రకాశముగ ) అహునా! జాల మెందులకు?

ఉ॥ గాండివముంగలట్టి త్రిజ ♦ గన్నుతబాహుబలుండ వీవు; సూ
తుండను నేను, నీకుఁగల ♦ దోర్బలసంపద తెల్లమయ్యెఁ; గో
దండివి నీవు; నేను గదఁ ♦ దాల్చితి; నిన్ను వధింతు. నా గదా
దండము కాలదండము; ర ♦ థంబిలఁ గ్రుంగినఁ జేవ గ్రుంగునే?

వెండియు నీ వొండు రహస్యము గ్రహింపవలసియున్నది. దుర
దృష్టవశమున నేఁ జచ్చెదంగాక. "కర్ణుని జయించితి" నను గ
ర్వము నీ కెంత వలదు. ఏమందువేని,

సీ॥ కపటభూసురవేష ♦ గాత్రుఁడై, దేవతా
ధ్యక్షుండు నను నొంప ♦ గర్తుఁ డయ్యె.
ధాత్రీసురేంద్రప ♦ విత్రజిహ్వోద్భూత
శాపంబు జ్యాముక్త ♦ రోపమయ్యె
వరములం గాంక్షించి ♦ పాండుభూవరుమనో
హర్త్రి నారయొడఁబాఱ ♦ హర్త్రియయ్యె
వైరిదైనోగ్రహిదై ♦ సారథ్యము వహించి
శల్యుండు హృచ్ఛల్య ♦ తుల్యుఁ డయ్యె



.॥ రథము క్రుంగె, ఘనసన్మనో ♦ రథము సిద్ధిఁ
జెందె, నా దెండమున నగ్నృతి ♦ డిందె: క్రీడికు
ముదము గూర్పఁ గృష్ణుఁడు కొంత ♦ మోసపుచ్చెఁ
గాక యున్న యేపాటిసే ♦ కంసబలిమి?

గీ॥ రథము క్రుంగిన నేమియా ♦ యుగము లేక
యున్న నేమి నా మేనిదు ♦ మ్రొందుచాలు
నీకుఁ బిరికి లోఁబడ్డైనె ♦ నినువధింప
మల్లచఱచితివమ్మూర్ఖ నీ ♦ మదనణాంగు

( అని కర్ణుండు నిష్క్రమించును. )

కృష్ణు:— అర్జునా! వేగమే వీని శిరముఁ దునుమవలయు.

అర్జు:— కృష్ణా! ఈ రాజ్యలక్ష్మికొరకై మగుడ నధర్మకార్యముల నెన్నిటిఁ జేయ మనెదవు. భీష్మద్రోణులఁ జంపు కిల్బిషము చాలదా?

ఉ॥ కేలు వడంకుచుండెఁ గడు; ♦ గీతలరించుక యభ్యసించి చు
ట్టాలవధించినాఁడ నకట! ♦ టాయది చాలదె? చాలుఁ జాలు నీ
యాలము; రాజ్యవైభవము ♦ భ్రాతృనియంబులనాసఁ జెంది, యే
లీలవధించెదన్ రథము ♦ లేక యురంబొనరించు కర్ణునిన్

కృష్ణు:— అర్జునా! మాటిమాటికి [illegible] యుద్ధమంతమగు దాక నేనుడువునట్లు గావింపుచుండుము. యుద్ధానంతరము సర్వము నీకు బోధించెద.

అర్జు:— నీవాజ్ఞాపింపఁ గాదనియందునా? మున్ను గావించిన దోషములలోనిది యెంతటిది.

ఉ॥ పిన్నటినాటినుండినను ♦ జేరిమి పెంపున నాదరించి, నా
యన్నకుమార! రార! యని ♦ యాఁదట ముద్దులఁ గులుకు శౌర్యసం
పన్నిధి, భీష్మునిన్ విజిత ♦ భార్గవతామునిఁ జంపునట్టి నా
కెన్నికయున్నె కర్ణుఁడవ?ఁ ♦ గృష్ణ! కడుంగడుఁ దప్పుఁ జేసితిన్

ఉ॥ చెప్పె సమస్తవిద్యలను, ♦ శిష్యులలోనను బెద్దఁ జేసె, నా
తప్పులనోర్చె, నేర్పరణ ♦ ధర్మము. నట్టి యొజ్జకున్
ముప్పునఁ గుట్టిల్ల మేల్మరచు ♦ మోఱకుఁ బోలికమిన్నకుంటి, నే
నిప్పుడు కర్ణునిందునుమ ♦ నేటికి జంకెదఁ బాపచిత్తుఁడన్.

కృష్ణు:— అర్జునా! ఈవిచారములతో నిపుడు లాభమేమి?

గీ॥ పాపపుణ్యంబులెల్లనా ♦ వల నెఱుంగ
వచ్చు; వేఁటసింగంబుచేఁ ♦ బడినతత్తిని
కరుణవహించి యుందువేఁ ♦ టరులు గలరె?
ఎట్టిదో క్షాత్రధర్మమిా ♦ నెఱుఁగనయ్యొ.

అర్జు:— నీయాజ్ఞనుల్లంఘించెదనా?

కృష్ణు:— అటులైన శీఘ్రమేరమ్ము.

(అనియర్జునుని కరముబట్టుకొని కృష్ణుఁడు నిష్క్రమించెరు)

శల్యు:— అబ్బ! ఇప్పటికి కృష్ణార్జునసంవాదము ముగిసినది. కర్ణుఁడు చచ్చుట నిశ్చయము. (అని తెర వైపుఁ జూచి) ఔరా! విరథుండైనఁ గర్ణుఁడెట్లు యుద్ధముం జేయుచున్నాఁడ

మేలు మేలు కర్ణా!

గీ॥ రాజధర్మంబుఁ బాటించి ♦ రణ మొనర్చి
నిష్కళంక యశమ్మున ♦ నెగడితీవు
ద్రోహముఁ దలంచి నిను నిరు ♦ త్సాహుఁ జేసి
యశముఁ గాంచితి నెయ్యది ♦ యధికమగునో?

అహాహా! మఱియేమున్నది. కర్ణునకుఁ గాలము సమీపించినది.

గీ॥ యమభటోగ్రదంష్ట్రాచ ♦ యంబుఁ బోలి
క్రూరవడబాగ్ని కీలల ♦ కోలఁదిఁ గాంచి
మించి భండనస్థలి నాక్ర ♦ మించి, విజయ
కనకపుంఖాస్త్రసంఘంబు ♦ కర్ణుఁ జెనకు

ఇట్టి దారుణకార్యముఁ జూచుటకు నాకనులు గావించిన పాపమెట్టిదో?

గీ॥ వైరిరాజమండలకాంతి ♦ వమ్ముఁ జేసి
కౌరవాధీశ్వరహృదయపం ♦ కజమున కోడ
యుఁడయి మృత్యువన్ గాలాహి ♦ యొడిసి పట్టఁ
కర్ణమార్తాండబింబంబు ♦ కాంతిఁ దొలఁగె

ఎప్పటి కెయ్యది రానున్నదో యెఱుంగ నేరికగును? అహాహా! చూచుచుండ దుఃఖము పొంగుచున్నదికదా? కిరీటికర్ణునకు సాటియగు మేటియా? అయిన నేమి కర్ణుఁ డల్పుఁడయ్యె.

గీ॥ స్వభుజదర్పంబు, స్వపరితా ♦ పంబుఁదలఁచి
మనుజుఁడొనరించుకార్యంబు ♦ మంచిదైన
నధికుఁడననొప్పుఁగీడైన ♦ నల్పుఁడగును
సకలజనులువశులుకాల ♦ చక్రమునకు

మఱియేమున్నది? కురురాజు దుఃఖాంధకారమునఁబడు కాలమునసమీపించినది.

గీ॥ పాండుసుతమనశ్శల్యంబు ♦ బరిహృతమయికెఁ
బెలుకిసైచెనోయననేడు ♦ బింకముడిగి
క్షత్రియులుకులుకంఠంబు ♦ కాడిపాఱఁ
గాలునింజూడఁదెంపరి, ♦ కర్ణుఁడణఁగె



సీ॥ తనచాపరోపహరి ♦ తాపవహ్నికిమేరు
భూధరమపరంజి ♦ పూదెగాఁగ
జనశాంతవదనంబు ♦ వనజారినింబోలి
కౌరవసైన్య ♦ గణముఁదెనుప
వనదానసుగుణంబు ♦ ధరణీసురులకెల్ల
మహానిగీర్వాణమురి ♦ మంబుగాఁగ
జనయశఃకౌముది ♦ తంతంబుభాస్వచ్ఛ
గచ్ఛందిరికాడంబ ♦ రమునణంపఁ
గీ॥ బాహ్లీకసామ్రాజ్యవైభవ ♦ పారిభవములఁ

బూర్వమండలాధిపతుల ♦ పొలుపుఁగాంచి
పాండునందనులయదృష్ట ♦ వశమువలనఁ
గర్ణుఁడిదెపోవుచున్నాఁడు ♦ కాలపురికి

( తెరలోకలకలము. )

శల్యు:— అహో ప్రమాదము సంభవింపుచున్నదే ? కర్ణుఁడు నేలఁగూలిన కారణంబునఁగురుసైన్యము దైన్యముఁజెంది పంచబంగాళమైనది. కర్ణునింజంపితినను సంతోషమున నర్జునుఁడు ధర్మరాజుపజ్జకేగుచున్నట్లున్నది. భీముఁడుకురుసైన్యముపైఁజెలరేగుచున్నాఁడు, కృష్ణుఁడుకర్ణునిపజ్జ నిలిచియున్నట్లున్నది. ఇంక నేనాలస్యముఁ జెందఁజనదు. ఓకౌరవయోధవరులారా!

ఉ॥ ఇంచుకతాల్మిఁబూనుఁడు,జ ♦ యించెదమీకుజయంబు నేడుగా
వించెద, నాబలంబుగని ♦ పించెదగాజునకెల్లరాజ్యమి
ప్పించెద, శత్రురాజులశ ♦ పించెద, నాజినిసింగమట్లువ
ర్తించెద, యుద్ధభారముభరించెద, ♦ నెమ్మదినంగరాజుఁగీ
ర్తించెద, వైరితేజముహరించెద, ♦ బల్మినిపానుచేప్పశి
క్షించెద, సంతసంబుగలిగించెద ♦ వాయుతసూజునాజిఁగా
రించెదగెల్పులచ్చినివరించెద, ♦ ధీరతఁబార్థుపైనిలం
ఘించెద,ఁబోర్పుమంచుబలి ♦ కించెదమించెదఁగీర్తిఁగాంచెదన్

(అని శల్యుఁడు నిష్క్రమించును. )

## — కురుక్షేత్రము. —



యుద్ధరంగమునఁ గర్ణుఁడుగూలి పడియుండును. కృష్ణుఁడు శల్యుఁడునొకయోరనిలిచియుందురు.

కర్ణు:— కృష్ణా! నీకోరికనెరవేరినదిగదా? అయిననీవేమియను భవింపఁగలవు.

ఉ॥ వంచనయన్హలంబునకుఁ ◆ బాండుతనూభవులక్షనృపంబులన్
బూంచి, యసృగ్ఝరీసలిల ◆ ముల్ రణభూమినిజల్లిసాగుగా
వించి, యరాతివీరగళ ◆ బీజములంతటనాటినాటిజ్యం
భించినయంత నేమనుభ ◆ వించెదవీవుకృషీవలుండవై;

కృష్ణ:— నిశ్చయమే. ఇందు నేననుభవించుటకుఁగాదు. అది యట్లుండనీవునేఁజెప్పినట్లు పాండవులంజేరియున్న నీకీదురవస్థ లేకయుండుఁగదా?

కర్ణు:— కృష్ణా! ఆవిచారమునాకునుంతయూలేదు.

మ॥ జననాథుండపతఁడేనుసూతకుల ◆ సంజాతుండనట్లయ్యుఁజే
ర్మ్రనిరావించివిశేషతోషమున ◆ మైత్రింజేసి, నన్ రాజుఁజే
సినదుర్యోధనుఁబాసితన్మ్రలనుచుఁ ◆ జింతించియాపాండునం
దనులంగూడుటకంటెఁజచ్చుటయాన ◆ ధర్మంబుగానెంచితిన్

వెండియు రాజ్యభోగములయం దాశక్తియు, నర్జునుఁడునను వధింపఁజాలునను నధైర్యము నామనంబున లేవు.

చం॥ కురువిభుపేరనిబ్భవిన ◆ సంతతబాహుపరాక్రమోన్నతిన్
జరనృపులెల్లసాదలలు ◆ వంపథుద్రంబుగనేనయేలిను
స్థిరముగరాజ్యభోగములఁ ◆ జెందితిఁ. గృష్ణ! దురంబునందు నా
దురథముకుంగఁగాదెనుఁ ◆ దుంచెఁగిరీటియధర్మవైఖరిన్

కృష్ణా! అతిశయోక్తిగనుండిన నుండుగాక. (ఇంచుకరోషముతో)

చం॥ చలముదొలంగిపోరియనిఁ ◆ జచ్చిరిభీష్ముఁడుద్రోణుఁడాదిగా
గలకురువృద్ధులెల్ల. ;జయ ◆ కాంతలభించెనటంచునెమ్మదిన్
దలఁచిరిపాండుపుత్త్రులుఠ ◆ ధంబిలఁగ్రుంకకయున్న నీమఱం
దులబ్రదుకెట్టిమార్పఁగను ◆ నోయిపుడేనువచింపనేటికిన్

కృష్ణు:— కర్ణా! నీరథము భూమింగ్రుంగకున్న నర్జునుండు నిన్నుఁ జంపఁజాలఁడని నేనునిశ్చయముగఁజెప్పఁగలను.

శల్యు:— అందులకుసందేహమేమి?

కర్ణు:— కృష్ణా! ఇపుడాపలుకులవలన నేమితృప్తియుండును?

శా॥ ఘోరారణ్యముఁగాల్చిముజ్జగములు ◆ ద్ఘోషింప, జంభారిదో
స్సారంబున్ స్వబలాతిరేకమునని ◆ స్సారంబుఁగావించి, హం
పీరాగ్రేసరుఁ డైనను స్సుఁగొనునా ◆ వివ్వచ్చునాద్ధత్యమున్
బీరంబున్ దుదిముట్టఁజూడఁ జతీత ◆ ప్పెనదప్పె నిర్భాగ్యుఁడన్

మ॥ నరుఁడాభీష్మునిధాటికోడిదిగులొం ♦ దన్ గాంచిచక్రింబునన్
గరిపైసింగముమాడ్కి భీష్మునిపయిన్ ♦ లంఘించియాటోపభీ
కరముంజూపితివీవు; నాకురథమె ♦ క్కంటన్నుఁబంచాయుధ
స్ఫురణంబున్బ్రకటించిరుద్రునివలెన్ ♦ జూపింపవేరాదరిపున్

కృష్ణ:— కర్ణా! ఇపుడిట్లునీవు విచారించిన లాభమేముండును. నీకునిర్వాణకాలము సమీపించుచున్నది. కోరికలున్నఁదెలియంజేయుము. నెరవేర్పఁబ్రయత్నించెద.

శల్యు:— దుర్యోధనుఁడు గాపాడంబడు కోరికదక్క మఱియొండుకోరిక కర్ణునకేలయుండును?

కర్ణ:— కృష్ణా! నాపయింగల యభిమానముచే నీవట్లనుచుంటివిగాని నాకుఁగోరికలేమున్నవి? పాండవులయందుఁ గౌరవులయందునాకు సమానభావము గలదనినీవెఱుంగుదువు. పాండవులుగెలువంజాలిరేని నాసహోదరులు రాజ్యమేలఁగలరు. కౌరవులుగెలువంజాలిరేని నన్నుఁబోషించిన దుర్యోధనుడు రాజ్యమేలగలఁడు. ఎవరైన నాకెయ్యెడ మేలుగలదు.

సీ॥ కన్యయైయొకడుఁబేర్మిఁ ♦ గడుపారగాంచినకుంతికోరినయట్టికోర్కెదీర్చి
అల్లారుఁబెంచినతల్లిదండ్రులుసంత ♦ సముఁజెందముద్దుముచ్చటలఁదీర్చి
క్రీడిసెదర్పహారాడుసేయంచుసం ♦ దేహించుజమలసందియముదీర్చి
పరులెల్లదుఃఖింపనతనికోసరించి ♦ నట్టిసుయోధను నప్పుదీర్చి

గీ॥ పాండవనందనులయదృష్ట ♦ వశమువలన
రథము భువిగ్రుంగఁ దన మనో ♦ రథమణంగ
స్వాంతమునఁ జింతలేకుండ ♦ సంగరమునఁ
గూలి చానున్నవానికిఁ ♦ గోర్కెలేల?

చ॥ వెరపరిగ్గైన యర్జునుఁడు ♦ వైరులకుం దలమానికంబు మీ
దరయఁడు గాక సూతజుఁడ ♦ హంకృతిమై ధ్వజమెత్తివచ్చినన్
వెఱచెడువాఁడె? యంచుఁ గురువృద్ధులు పల్కిన పల్కులెల్ల బ
ల్లఱపులుగాఁగఁ బోరితిని ♦ యంతియుజాలు భుజంగభంజనా.

అయినసీవు కోరినవాఁడ వగుటచే నా యభిప్రాయము తెలిపెనను. భీష్మద్రోణాకర్ణుల వచించిన యధర్మమార్గము గాక, నీవు బలరాముఁడు మధ్యవర్తులై యుండి న్యాయమార్గమున దుర్యోధనుజయించి పాండవులకు రాజ్యమిప్పింపుము.

కృష్ణు:—(మందహాసమున) నాకుసహితమట్లు గావింపవలయు ననియే యుండును.

కర్ణు:—అవును కృష్ణా, నిన్నె ఉంగుదును. (అని శల్యునిజూచి) శల్యా, నాపలుకులుగ దుర్యోధనునితో నిటులజెప్పుము.

గీ॥ కాల మనుకూలమైన భూ ♦ పాలకుండు
పౌరుషంబున కార్య సా ♦ ఫల్యమొందుఁ
జవుటినేల నాటినవిత్తు ♦ చందమయ్యె
మన మహాహవ సన్నాహ ♦ మనుఁగు సఖుఁడ.



ఆ॥ వె॥ భీష్మకుంభజాది ♦ వృద్ధులుపలుకుల
నమ్మకుండ నన్ను ♦ నమ్మితుదనుఁ
"కుక్కతోకఁబట్టి ♦ గోదావరీదంగఁ"
గడఁగునట్టులయ్యెఁ ♦ గౌరవేంద్ర

గీ॥ భీమునకుఁజిక్కితమ్ముండు ♦ వెనఁగులాడఁ
బోవలేకుంటి, విన్వచ్చుఁ ♦ బోరిరణమున
గెలువలేకుంటి, నా మైత్రి ♦ వలనఁ దుదిని
వ్యర్థమయ్యె నీయత్నంబు ♦ పార్థివేంద్ర

ఉ॥ కౌరవనాథ! నీకుఁగల ♦ కల్మి నశింపకయుండ నాదుదో
స్స్వనమునన్ విరోధులను ♦ జంపి జయేందిరఁ బెండ్లియాడఁ జేఁ
గోరితిఁ బోరితిన్ దుదకుఁ ♦ గూలితి వెండియుఁ గర్ణశావలన్
ఘోరలయుద్ధము'న్నయప ♦ వాదముఁ జెందితిఁ జాలకుందితిన్

ఉ॥ నీచపలంబునందునః ♦ న్నొంచిన నూతనుతుండనయ్యె, సం
కోచము లేని చిత్తమునఁ ♦ గూరిమి తమ్ముని పోల్కి నీవునన్
జూచితివందుకుం జెలఁగి ♦ శూరులు మెచ్చ నస్పృగ్ఘ్ రిన్ నరుణ
వైచితి; నేమిలాభము ర ♦ ణంబునఁ గూలితి దైవికంబుగన్

సుదరినాథా! నేఁగూలితినను వార్త వినినతక్షణము దుర్యోధనుఁడు గాఢముగ మూర్ఛిల్లియుండనోపు. లేనియెడ నిచ్చటికి వచ్చియుండును. నీవు సత్వరముగఁ బోయి దుర్యోధనునకు ధైర్య

ముఁగొలిపి, సైన్యాధిపత్యము వహించినేనులేనికో అంతదిట్టము.

శల్యు:— అంగరాజా! నీవుగతించినపిమ్మట మఱియుద్ధముతో నేమి! మున్నుస్వర్గమునకుఁబోయి నీవుండ నేను సహితమువచ్చినిన్నుఁజూడఁగలను. పోయివచ్చెదః

( అని శల్యుఁడునిష్క్రమించును. )

కర్ణు:— కృష్ణా! ధర్మరాజునీకొఱకుఁగాఁబోలువచ్చుచున్నవాఁడు.

కృష్ణు:— కాదు. కాదు. నీవుగతించినవార్తవినియునిజమోయబద్ధమో ప్రత్యక్షముగఁజూడవచ్చుచున్నాఁడు. వైరముఁజూపింపక ధర్మరాజునాశీర్వదింపుము.

కర్ణు:— వైరమెందులకు. అవశ్యమట్లొనర్చెద.

ధర్మ:— ( ప్రవేశించి ) కృష్ణా! ఎందులకిచట వేచియుంటివి.

కృష్ణు:— కర్ణుఁడు జీవన్ముక్తిఁజెందు కాలము సమీపించుటచే వేచియుంటిని.

ధర్మ:— ( కర్ణునింజూచితనలో ) అబ్బ! మనమనశ్శల్యమిప్పటికి నశించినది.

(ప్రకాశముగ) అంగరాజా! నీవుమిక్కిలిధన్యుఁడవు.

సీ॥ భార్గవరామునిపజ్జశిష్యుండవై ♦ యఖిలశాస్త్రాస్త్రంబులగసితీవ్ర

శవృష్టిసైదిశింపఁగలమేటియొంటరి ♦ యంచుసెన్నఁగఖ్యాతిఁగాంచితీవ

భూరిశస్త్రాస్త్రనైపుణ్యంబుప్రకటించి ♦ పరిపాలకత్వంబుఁబడసితీవు
ధనముతృణంబుగాఁద్యాగంబుగావించి ♦ దానకర్ణుండనఁదనరితీవు

గీ॥ జలధినిమథించుమందరా ♦ చలముమాడ్కి
స్వర్ణపుంఖానుపుంఖా ♦ స్త్రసమితినరులఁ
గూల్చి, సఖునిఋణముదీర్చి ♦ గూలితీవు
సార్థకంబయ్యెభవదీయ ♦ జన్మమనఘ

కర్ణు:— ధర్మరాజా! యెల్లరాజ్యపాలన మొకరిస్వాధీనమనుసనుం డడుగదా? మావంతయునది. ఇఁకనీవంతున్నది,

ఉ॥ పాడిఁదలంచియార్యజన ♦ వర్యులప్రాపుడిసంగ్రహించి, ప్రాఁ
జాడలమంచినెంచిజన ♦ సంఘముఁజక్కగసంస్కరించి, మేల్
కీడులపొల్పుఁగాంచిపటు ♦ కీర్తివహించి, ధరిత్రిమించి, ని
న్నెడవచక్రవర్తిగఁగ ♦ వీందుఁలుమెచ్చగరాజ్యమేలుమీ

( తనలో ) దుర్యోధను నాశీర్వదింపవలసిన నేనుధర్మరాజునాశీర్వదింపవలసివచ్చెఁగదా? తుదకునాస్నేహము సుయోధను మోసపుచ్చినది. హాస్నేహమా!

ఉ॥ చందలలక్ష్మినాదుపరి ♦ చారికయైకనుసన్నఁగొల్వఁగా
వించితి, దాన దానములఁ ♦ బెక్కులొనర్చియశంబుగాంచి మె
ప్పించితిలోకమెల్ల; రిపు ♦ వీరులుభీతిఁదల్లడిల్లను

న్నించువిధంబు జేసితివి ♦ నీవయినన్ మదిఁ గౌరవేశుఁ ద్రో
యించితివాపదబ్ధిః నిను ♦ నిప్పుడె పాణముతోఁ ద్యజించెదన్

( ప్రకాశముగ హీనస్వరముతో ) కృష్ణా! ఆయాసముగను
న్నది. సెలవుఁ గైకొనియెద. దయయుంచుము.

కృష్ణః:— కర్ణా! అర్జునుఁడు నిన్నధర్మముగఁ జంపెనని మనం
బునఁ జింతిలకుము.

మ॥ మలమూత్రాస్థిశిరక్తమాంసముల ♦ సంసారాబ్ధిలోఁ ద్రిళ్ళినై
చ్చెలులం బాయు శరీరమున్నరుఁడు ♦ దుర్గించెగా; నీదు వజ్రోపమో
జ్జ్వలసత్కీర్తి శరీరమున్ దునుమ ♦ గాశక్తుండెయూహింప ధరా
స్థలి నీజన్మము వర్ణనీయమగున ♦ శాంతింబునికఁ బొంబుగణ్ణా

కర్ణః:— ( ఆయాసమభినయింపుచు ) నారాయణ. నారాయణ.
నారాయణ ( అని దీర్ఘనిశ్వాసము విడిచి విగతజీవుండగును )

కృష్ణః:— ధర్మరాజా! నిష్కారణముగ నన్నర్జునుని దూషించితి
వి. ఇపుడు నీకోరిక నెరవేరినదిగదా?

ధర్మ:— కృష్ణా! కర్ణుఁడు గతించినందులకు సంతోషమునకు
మారుదుఃఖము పొంగుచున్నది.

కృష్ణః:— ఈపలుకులకేమి సంతోషము మాత్రము లేకుండెనా!

చం॥ కలుములచానకేలుఁగవఁ ♦ గ్రాలెడుకమ్మనితమ్మిపూవులై
తెలిజిగిఁదేఱుపుష్కరన ♦ దిగ్బ్రియమారగఁగన్నతల్లులై
బలిబలసాహసంబులను ♦ బల్మినడంచినపర్వతమ్ములై
యలరుభవత్పదాంబుజము ♦ లాత్మఁదలంచినమస్కరించెదన్

( అంతఁదెరలో నోకౌరవయోధవరులారా? )

ఉ॥ వచ్చినయంగభూవిభుని ♦ స్థానమునందుఁగొఱంతఁదీర్పనే
వచ్చితి; భీతిఁదక్కనెటి ♦ వాఁడిమి వేఁడిమిలావునూపి వీఁ
వ్వచ్చునిభీమునింగవిసి ♦ వైరముతోరముగాఁగఁబోరుడిం
పచ్చుపడంగభూరివిజ ♦ యంబురయంబునఁబొందుడేపుమై

కృష్ణ:— ధర్మరాజా! శల్యుఁడు సైన్యాధిపత్యమువహించెను. నీవంతువచ్చినది. రథివై యుద్ధముంజేయవలసివచ్చును.

ధర్మ:— నీవుండనాకేమి భయము సిద్ధముగనున్నాను. రముత్రి

( అనియిరువురునిష్క్రమింతురు. )

గద్య॥ ఇది శ్రీమద్భాగవతుల నృసింహశర్మ విరచితవిజయవిజయం బను రూపకంబున పంచమాంకంబు సర్వంబు సంపూర్ణము.

—: శ్రీరామార్పణమస్తు. :—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 114 | 8 | శ్రోచె | మిమ్ముఁబ్రోచె |
| 113 | 16 | అట్లయిచో | ,అట్లయినచో |
| 113 | 16 | పోరుటనధర్మమే, | పోరుటయునధర్మమే |
| 117 | 7 | నీకెంతవలదు, | నీకెంమాత్రమువలదు |
| 118 | 12 | నాసఁజెంది, | కాసఁజెంది |
| 119 | 6 | ధర్మమునట్టి, | ధర్మమమర్మమునట్టి |
| 120 | 13 | కౌరవాధీశ్వరు, | కౌరవాధీశు |
| 121 | 3 | నధికుఁడననొవ్వ, | నధికుఁడననొప్ప |
| 122 | 10 | ఆలస్యముఁజెంద, | ఆలస్యముఁజేర |
| 126 | 5 | వైరులకు, | వీరులకు |

